## గమనించాలి...

ఈ నాటకాన్ని ప్రదర్శించాలన్నా
అంతో యింతో రికార్డు చేయాలన్నా
గ్రంధకర్త అనుమతి పొందాలని...

## స్తుతి:

ఇది తారార్కముగా, జగత్ప్రళయ సంక్రీడన్మహాభైరవ ప్రథనోద్వేగములన్ గమించి, రుచిరప్రారంభ రమ్యాంశువుల్ కదుపున్ గావుత, వేంకటాచలు కృపన్ గైసేసి, మాఆంధ్ర సంఘదయావృష్టి ఫలించు సంస్కరణ సంకల్పంబమోఘంబుగన్.

తాండ్ర...

కృతి:

నను కన్నతల్లి

శ్రీకోటమ్మగారి పాదపీఠానికి.

ఈమెను మీచేతుల్లోకి అందిస్తున్నా. దిద్ది తీర్చుకో
సినవారు రసికులు.

ఇంతకంటె ఏం మనవి చెయ్యను?

తాండ్ర...

కృతి

న ను క న్న త ల్లి

శ్రీకోటమ్మగారి పాదపీఠానికి

# వేషాలు

పరదేశి
శివదాసు
రామనాథం
తీర్థులు
శిష్యుడు
శంకరరావు
రాజశేఖరం
కామోజీ
సుశీల
రాజ్యలక్ష్మి
పద్మావతి
రత్నాబాయి

ఇంకా —

బ్రాహ్మణులు — అర్చకులు — పంచములు

ఉన్నారు.

# పతితపావన

## ప్రథమాంకము.

### ప్రథమ రంగము.

స్థలం : వీధి — సమయము : సూర్యుడప్పుడే ఉదయిస్తున్నాడు.

(ముక్కోటి ఏకాదశి — భావనారాయణస్వామి ఊరేగింపు జరుగుతూంటుంది. వాద్యాలకోలాహలం మిన్నంటిపోతూంటి. అక్కడక్కడ ఆగినచోట సన్నాయి శ్రావ్యంగా వినిపిస్తూంది. టెంకాయలు, హారతులు- అది భక్త్యానందాల అపూర్వసంగ్రహం.)

పరదేశి : (మాలదేవుడు - మాసినవస్త్రాలు. కలరాతగిలిన తల్లితో వేగించి, రాత్రి నిద్రలేని ఎరుపెక్కిన కళ్లు.)

బాబుగారు !

(లోపలనుంచి)

ఎవరు వారు?

పర : అయ్యా ! నేనాండి, పరదేశిని.

రామనాథం: (ఏదో ఆతురతగావచ్చి) నీవటోయ్ — ఇల్లారా, ఎప్పుడొచ్చావు?

పర: (దగ్గరకువస్తాడు) దండములండి - మొన్నసాయంకాలం వచ్చాను. మాఅమ్మకుకలరాతగిలింది. చాలాకష్టంలో వుంది. ఆమెను వదలిరాలేక తమదర్శనం చేసుకోలేక పోయాను.

రామ: మరి వైద్యమో, సైద్యమో, యేమన్నాసాగించావా?

పర: మాగూడెంలో వైద్యుణ్ణి ఆశ్రయిస్తే యేదోవైద్యం చేశాడు. నిన్న ఉదయం ఆసుపత్రికెళ్లితే, వారేదో మందిచ్చారు. దానితోనూ ఏమి నయంలేదు. మధ్యాహ్నానికి చాలా తీవ్రమైంది. వెంటనే డాక్టరుగారితో మనవిచేసుకున్నాను. రోగిని ఆసుపత్రికి తీసుకోవస్తే యింజక్షన్ ఇస్తామన్నారు. పదిరూపాయిలు అయితుందిట బాబయ్యా!

రామ: కలరా ఇంజక్షన్‌కు పదిరూపాయి లేమిటోయి? ఈ క్రొత్తగా వచ్చిన డాక్టరుకు దాహమధికమట. బీదాబిక్కిని కనిపెట్టే మచ్చుకాదు. డబ్బులేకపోతే మాట్లాడడుట కూడాను. ఇలాంటివాళ్లు డాక్టర్లు — పేరుకు ధర్మాస్పత్రులు. సరేగాని, పాపాచార్ల యింటికెళ్లేవు?

పర : వారివద్దకే వెళుతున్నాను. వారిని తమరెరుగుదురుగా బాబు! వైద్యం ఏలావున్నా మాబోంట్లను చూస్తే కసరికొడతారు. తమరు వెళ్లమంటే వెళతాను.

రామ : వెళ్లిచూడు, ఏమంటారో కనుక్కో — ఆతరువాత చూతాము. హరిద్వారంనుంచి వచ్చిన తరువాత గణపతిశాస్త్రిగారు ఆశ్రమంలో ఉన్నారా?

పర : చిత్రము. ఎప్పుడూ తమర్ని అనుకోని నిమిషంఉండదు. ఈమధ్య ఉత్తరరామచరిత్ర పాఠం చెపుతూ "స్నేహం దయాం తథాసౌఖ్యం యదివాజానకీమపి, ఆరాధ నాయలోకస్య ముంచతో నాస్తిమేవ్యథా" అన్న శ్లోకానికి, వ్యాఖ్యానంచెపుతూ, శ్లోకార్థం సరిగ్గా తమ జీవితంతో పోలికగా ఉందని శెలవిచ్చారు.

రామ : అదివారివాత్సల్య విశేషం. కొద్దిని గొప్పగా చెప్పడం పెద్దలస్వభావం. నీవ్యాసంగం చక్కగా సాగుతున్న దన్నమాటే.

పర : చిత్తం అంతా తమచలవేగదా.

రామ : సరి. సరి. ముందు ఆవైద్యంపనిచూడు. మరొకసారి సావకాశంగా కలుసుకుందాం.

(లోపల మేళతాళాలు వినబడును.)

(లోపల) అమ్మో — ఆమాత్రం పుణ్యంకూడానా యీ పాపిష్టిలకు అబ్బుతుందా — ముక్కోటిఏకాదశిపూట — ప్రాప్తం ఉండొద్దూ. అమ్మాయి సుశీలా — స్వామివారి ఊరేగింపు వస్తున్నది. కాయ కర్పూరం పళ్ళెంలో ఉంచాను స్వామివారికియ్యి.

(లోపల) తులసికట్టకు ముగ్గు పెడుతున్నా, కాస్త నీవేఅందిస్తూ.

(లోపల) మాటకుమాట జవాబియ్యటం బాగానేర్చుకున్నావు. నేనురావటానికి వీల్లేకేగా నీకు చెప్పింది.

(ఊరేగింపు రామనాథంగారి యింటివద్ద ఆగును.)

రాజ్య : (కొంచెం ప్రక్కగా నిలువబడి) ఆ అబ్బిని కాస్త దూరంగానన్నా వెళ్ళమనండి.

రాము : నోరుముయ్యి.

రాజ్య : నోరుమూసుకునే అఘోరిస్తున్నాను. ఊరంతా మోగిపొయ్యేదానికి నానోరొక్కటి మూసుకుంటే ఆగుతుందా?

హరి : (కొంచెం దూరంగా తొలగును.)

సుశీల : (అర్చకునకు కాయలు కర్పూరం ఇచ్చును. అర్చకుడు టెంకాయకొట్టి కర్పూరం వెలిగించి సుశీలకు తులసి యిచ్చును. రామనాథునకు యివ్వబోతూ పరదేశి చేత పెట్టబోతాడు.)

పర : (వెనుకకుతగ్గి) వారికియ్యండి చాలు.

అర్చ: (తేఁపారజూచి) నీవెవరవు ?

పర : ఆదిమాంధ్రుడనండి.

అర్చ : ఆంధ్రుడవేగదా — అప్రాచ్యుడవుకావులే — సంకో చిస్తావేం?

(గుంపులో ఒకరు) : పాతగూడెం మాల పరదేశిగాడు.

ఒకడు : బ్రాహ్మణులకు గురువుగావడానికంటూ శాస్త్రులవారి శంకరాశ్రమంలో వ్యాసంగం చేసేవాడు వీడేనా.

ఇంకొకడు : ఆ - ఆ - ఆసంకరాశ్రమంలో వ్యాసంగం చేసేది యీమహానుభావుడే.

ఒకడు : వెళ్ళు అవతలకి వెళ్ళు.

అందరు: తన్నండి—మాల వెధవను తన్నండి. వీడి నెవరురమ్మన్నా రిక్కడికి.

ఇంకొకడు : యీరోజుల్లో వీళ్ళను రమ్మనడానికి పొమ్మనడానికి హక్కు ఎవరికి—బ్రాహ్మణులమని చెప్పుకునేవాళ్ళు వీళ్ళని కాచుకుతిరుగుతుంటే — వాళ్ళిప్పుడు నెత్తె క్కారు, ముద్దుపెట్టుకున్న కుక్క యేంజేస్తుంది.

(కొందరు గుడ్లెర్రచేసి పరదేశిపైకి బోదురు.)

రామ : ఆగండి — ఆగండి — ఏమిటా దౌర్జన్యం ?

ఒకడు : రామనాధంగారూ మీరిందులో ప్రవేశించకండి.

రామ : వాడు చేసినదేమిటి? ఆమట్టుకువాడు వొదిగి వొదిగి ఉన్నాడుగదా — రాజబాటలోకూడా మీఅధికార మేమిటి?

ఒకడు : చాలులే ఉద్ధరించావు. సంఘాన్నంతా సంకరంచేయ డానికి తలపడ్డావు.

సుశీల : ఎవరుస్వామీ! ఆసెలవిచ్చింది. భగవంతుని సన్నిధా నంలోకూడా తోడిమానవులను భేదభావంతో చూచే యీసంఘం సంకరంకావడమేకాదు సాంతం నశిస్తే సంతోషిస్తా.

ఒకడు : సంతోషించాం నీ ఉపన్యాసానికి.

రాజ్య : ఇక లోపలికిరావే నీసిగ్గు చితక.

సుశీ : నీవు ఊరకఉండవమ్మా.

ఒకడు : ఎవరు రాజ్యలక్ష్మమ్మగారా — పద్ధతి నియోగపు పాపరాజుపాకయాజిగారి కూతురామె — వారి ఆచా రాలు ఎక్కడ ? వీళ్ళెక్కడ?

రాజ్య : మూలనుండేవాళ్ళందరూ ముంగిటికివచ్చేగతి బట్టింది.

రామ : మీరందరు పరమభక్తులు. మేము పరమపాపాత్ములం. భగవంతుడిదృష్టిలో యీభేదభావమేవుంటే అనుక్షణా నికి ఒక్కప్రళయం కావలసిందేగదా — మీతో

వాగ్వాదం ఎందుకు? ఎవరికినచ్చినది వారికి ప్రియం.
మీకందరికి ఒక్క నమస్కారం - సాగనియ్యండి.

(ఊరేగింపు సాగిపోవును. సుశీల రాజ్యలక్ష్మి లోపలికిపోతారు)

ఒకడు : ఉద్యోగం మానేశాడేం ఈయన.

మరొక: యిదివరకు మిషనుకాలేజీలో టీచరు. క్రైస్తవ మతాన్నిగురించి ఏవో ఉపన్యాసాలుయిస్తే వాళ్ళు వత్తిడిచేసేవాళ్ళు — ఎందుకొచ్చిన గొడవఅని ఉద్యోగం మానేశాడు. (వెళ్ళును).

రామ : అర్థంలేని ఆచారాలు వేరుతన్నినయి.

పర : చిత్తం. లోకంబాబూ! లోకం.

(రామనాథం లోపలికివెళ్లును.)

కలుగదుగా తండ్రి గను పున్నె మతడు నా
పసితనమ్మున మిత్తి వాతబడుట
పొసగదుగా తోడబుట్టులు గనుప్రాప్తి
పుట్టుకతో వారు గిట్టియుంట
జరుగదుగా నిర్విచార జీవనమింత
అరిమురివెట్టు పేదరికమగుట
అబ్బదుగాతని వార పెద్దలగొల్వ
దరిజేరనీయక తరుముచుంట

కడకు రెక్కలదాచి, నన్ కడుపుతీపి
సాకి, సంతరించెడు తల్లి చరమగడియ
నెమ్మి పరిచర్యసేయు భాగ్యమ్ముకూడ
కలుగదా యిది విధివిపాకమ్ముగాదె!

( తెర. )

---

ప్రథమాంకము — ద్వితీయరంగం.

స్థలం: పాపాచార్యుల యిల్లు.
సమయం: ఉదయారుణకాంతుల్లో.

పరదేశి: (ప్రవేశించి) చుట్టపక్కముల వైముఖ్యము — ఇంటలేమిడి — అమ్మకు చరమదశ, దిక్కుమాలిన బ్రతుకు— ఈనష్టేటి యీతలోగడచి గట్టెక్కుదునా! గర్భనిర్భేదన కరమగు దుఃఖాగ్నిచే బద్దలుకావలసిన హృదయము ఒక్కొక్కమారు నవ్వుకొనుచున్నది. "జాతస్య మరణంధృవం" అని సమాధానముకాబోలు. ఇకనాకు తల్లిలేదా! అమ్మనాకు కరువగునా (కన్నులు తుడుచుకొని) ఈ వీధులన్నీ నాకు క్రొత్త. వైద్యుం పాపాచార్యులగారియిల్లు యీవైపులనే అన్నారు. (అని యిండ్లవరుస పారజూచి ఒకయింటిమీద చూపు నిలిపి) అయిల్లేకాబోలు — అవిగో తిరుమణిచూర్ణాలు

శంఖచక్రాలబల్ల – (కొంచెం ముందుకు పరిక్రమించి) భిషగ్రత్న, ఆయుర్వేద మార్తాండ, వైద్యం పాపాచార్యులు–(చదివి) స్వామీ–ఆచార్యులుగారూ – తలుపు కొంచెం తీస్తారా?

(లోపల) ఎవరువారు?

పర : అయ్యా – నేనాఅండి – వైద్యంకోసం వచ్చాను.

(లోపల) నేనంటే – సరే వస్తున్నాను ఉండు.

అమర్యాదః క్షుద్రశ్చలమతిరసూయాః ప్రసవభూః ।
కృతఘ్నో దుర్మానే, స్మరపరవశో, వంచనపరః ।
నృశంసః పాపిష్ఠః కథమహామితో దుఃఖజలధేరపారా ।
దుత్తీర్ణ స్తవపరిచరేయం చరణయోః । నధర్మ నిష్ఠాస్మి నచాత్మవేదీ నభక్తిమాంత్వచ్చరణారవిందే ।
అకించనోన్యగతి శ్శరణ్యః త్వత్పాదమూలం శరణంప్రపద్యే॥

పర : నమస్కారం స్వామీ.

పాపా : ఎవరు ?

పర : నన్ను పరదేశి అంటారు – చింతా సుంకమ్మ కొడుకునండి.

పాపా : చింతా సుంకమ్మ కొడుకవు. (ఆలోచించి) మాల వాళ్ళామీరు ?

పర : అయ్యా.

పాపా : వసారాలోనికి వచ్చావేమిటి_ఎవరియిల్లో తెలుసునా?

పర : తెలియకుంటే ఎల్లావస్తాను బాబూ !

పాపా : నడు అవతలకు _ తగుదునని వచ్చావు _ కళ్ళునెత్తి మీాదికి వచ్చాయా ఏమిటి - ఏమన్నాగాని - ఎప్పు డయినా యీావీధివంపు వచ్చారా - ఔరా నీపొగరు బోతుదనం !

పర : కోపగించకండి బాబూ (కొంచెం దూరంగాపోయి) ఆపత్కాలేనాస్తి మర్యాదః అన్నారుగనుక, వైద్యు లకు యిలాంటి పట్టింపులు ఉండవని వచ్చాను. క్షమిం చండి - మాఅమ్మ ఆయపాయ మంటూాఉన్నది. తెల్లవారుజాామునుంచీ దప్పి ఎక్కువయింది. మందు కంటూా వచ్చాను.

పాపా : (చురచురచూాచుచు) కలరాకు అవేలే లక్షణాలు _ ఆసుపత్రికి పోకూడదూ - మాాలమాాదిగలకు మందు లెయ్యడానికి కూర్చున్నామనుకున్నావా _ ఏమన్నా గాని _ అయినా రోగి స్థితిచూాడందే మందియ్యడం ఎల్లాగ ?

పర : వైద్యధర్మం ఎరిగినవారు - ఆపత్తిలోవచ్చాను మనవిచేసుకున్నాను. తమచిత్తం మాాభాగ్యం

ఆసుపత్రిమందుకూడ వేశాం ప్రయోజన పడలేదు.

పాపా : యీనైచ్యానుసంధానాని కేమిలే. అన్నివైద్యాలు చేసి ఆఖరుకు పట్టుపట్టుమన్న సమయానికి నాదగ్గరకు వచ్చావు. చివరికి వైద్యం పాపాచార్యులు మందేసి చంపినాడని అభాండం నానెత్తిమీద పెట్టడానికా - ఏమన్నాగాని.

పర : ఆలా ఎందుకనుకుంటారుబాబూ - ఆయుస్సుకు ఎవరు కర్తలు. ఏదన్నా మందుదయచేయండి- బ్రతికితే మీకు కీర్తిదక్కుతుంది - పుణ్యం కట్టుకున్నవారవుతారు. లేకుంటే మాప్రాప్తం అనుకుంటాం.

పాపా : సరే - ఆనక రెండు గంటలాగిరా? — ఏమన్నాగాని.

పర : బాబూ - యిప్పటికే చాల తడవైనది - ఘటంలో ఊపిరి ఉండేవరకు ఏదో యింత ఔషధసేవ ఆవసరం గదా అండీ — ఏదో దేవుడు బుద్ధి పుట్టించింది, తమ హస్తంతో యింతమందు దయచేయండి.

పాపా : ఏమిటా తొందర ఆనక్కురమ్మంటుంటేను ?

పర : పెద్దలు కోపపడకండి — వ్యాధి మన కట్టుబాట్లో ఉంటుందా అండీ - ఆయపాయ మంటున్నదని మనవి చేశానుకానా.

పాపా : అయితే ఏం చేయమంటావు? మడికట్టుకున్నాను. ఆహ్నికం తీర్చుకుని కోవెలకు వెళ్ళాలని అనుకుంటుండగానే హాజరయ్యావు — ఏమిటి — ముసలిముండ చస్తే - లోకానికి వెలితా? ఏమన్నా గాని - నేను గుడికిపోవాలి, సేవాకాలంకావాలి, ప్రసాదాలు విని యోగంకావాలి, ఇంటికిరావాలి. అంతవరకూవీల్లేదు.

పర : అయ్యో! నేనేమనిమనవిజేసుకోను? సర్వధర్మాలు చెప్పే తామే ఇలాసెలవిస్తే. మానవసేవకుమించిన భగవత్ కైంకర్యమున్నదా? స్వామీ! ఆపన్నుని రక్షించుటకు మించిన ధర్మమున్నదా?

పాపా : ఈ ధర్మపన్నాలకేమిలే? గుంటనా మిట్టనా పడి మాటలు నేర్చుకున్నావు. ముందు మందుఖర్చుకు ఐదురూపాయిలు తేమరి. ప్రతివాడికీ—మందు- మందు. ఏమన్నా గాని.

పర : ఆపూటగంజికి లేక మాడుతున్నాం. నిరాధారమైన జీవనం. రామనాథంబాబుగారు తమ దర్శనంచేయమని సెలవిచ్చారు. ఏమాత్రం ఉసులున్నా పెద్దలకి తృణమోఫణమో సమర్పించుకునేవాడినే. చిత్తగించారా? నిన్న ఆసుపత్రి డాక్టరు సగ్గుబియ్యపు జావఇమ్మంటే చోడిజావఇచ్చాం. ఇల్లాంటి పరిస్థితు

లలో నేనేమివ్వగలనుబాబూ - మీరే దేవుడని వచ్చాను. మీబిడ్డను.

పాపా : రామనాథం చెప్పాడూ ? (తనలో) కులభ్రష్టువెధవ. (పరిహాసంగా) వాడన్నీ చెబుతాడు. బ్రాహ్మణుల ఇళ్లకు వెళ్లమంటాడు. వీడిమూలాన్నే మీకు మేమంటే ఇంత నిర్లక్ష్యంఅయింది. కాదూమరి. అల్పుడికైశ్వర్యంవస్తే అర్ధరాత్రప్పుడు గొడుగుపట్ట మన్నాడట. వాడిసిఫారసుఏమిటినాకు ? డబ్బక్కడ పెట్టాలి - మందుతీసుకెళ్లాలి. అంతే. మరిమాట్లా డకు - ఏమన్నాగాని.

పుర : అయ్యా !

గంజిలేనిదినాల కడుపుమోయగలేక
శ్రమలోర్చి ఏతల్లి జన్మమిచ్చె
తనతీయచనుబాలు త్రావించి ముంగురుల్
సవరించి ఏతల్లి సాకికొనియె
నాచేతిమీద ప్రాణాలు పోనేతల్లి
వేయిదేవుళ్ళను వేడికొనియె
చదువుకొన్నను నిద్రచాలదేమోనని
ఏతల్లి నను బుజ్జగించియుండె

జీవితంబంత అమెతో చెల్లిపోవ
తండ్రిపోయినదాదిగా తండ్రియయ్యె
ఆమహాతల్లి—నాతల్లి అస్తమించు
స్వస్థయగునేమొ మీచేతి చలువవలన.

పాపా : ఓహో! వెళ్ళు. వెళ్ళు. కోవెలకు వేళ అయింది. దేవాలయంలోగంట మోగుతూంది.

శివదాసు: (ప్రవేశించి) పరదేశీ ! పరదేశీ ! అంతా అయిపోయింది. మందెందుకూ ? రా.

పర : దాసూ ! (ఆశ్చర్యమున—కన్నుల నీరునించి) ఆశ్వాసాంతమైనదా?—అమ్మపోయినదా ? (కన్నుల నీరు ధారగా కారుచుండును. గజగజ వణికిపోవుచుండ దాసుపట్టుకొని నడిపించుకొనిపోవును.)

( తెర ).

---

ప్రథమాంకము — తృతీయ రంగము.

స్థలం : రామనాథంగారి యింటివసారా.

సమయం : మధ్యాహ్నము.

(బ్రాహ్మణులు ముచ్చటించుచున్నారు.)

1 వ బ్రాహ్మ : అవధాన్లుగారూ — యజ్ఞానికి ఏమాత్రం పోగయింది ?

2 వ బ్రాహ్మ : ఎంతయినదండీ — నాలుగు వందలయినా పూడందే.

1 వ బ్రా : నాదెళ్ళవారి యింటివద్ద నెలక్రితం మనం కలుసుకున్నప్పుడు నాలుగు వందలే — యిప్పుడూ నాలుగు వందలే ?

2 వ బ్రా : అంతకంటే నాశ్రాద్ధం ఎక్కువయినదేదీ — పట్టీలో కనబడుతుందిగాని పైసాకనబడందే? ఎప్పటికవుతుందో ఏమిటో — రోజులు తరుముకొస్తున్నాయి — పది వేలు కావాలి—రాత్రిళ్ళు నిద్రఉండటంలేదంటే నమ్మ-గ్రామేక రాత్రం దినమేక భుక్తం అయింది.

1 వ బ్రా : అంత యేంజేస్తారు బాబూ — రూపాయలు హోమంచేస్తారా యేమిటి ?

2 వ బ్రా : యజ్ఞం అంటే మాటలామరి — కోనసీమనుండి కొందరు ఋత్విక్కులు రావాలి-మంథెననుంచి మాధవ

పెద్దివారి అన్నదమ్ములందరూ రావలసిందే — అగ్రహారంనుంచి అర్హ్యయిన సంపన్నులు అరవయిమందికి తక్కువగాకుండా రావాలి. ఇదిగాక విద్వాంసులు, పండితులు, భజనపరులు.

1 వ బ్రా : దారిఖర్చులకే అయిదువేలుకావాలా ?

2 వ బ్రా : తలకొక ఏబదైనా యివ్వాలామరి ?

1 వ బ్రా : డబ్బుఎందుకూ ధర్మానికి.

రామనాథం : (ప్రవేశించి) ఏమిటండి అది?

2 వ బ్రా : చయనులుగారి యజ్ఞానికి ఖర్చెంతా అని అనుకుంటున్నాం.

రామ : ఎంత అనుకుంటున్నారేమిటి ?

2 వ బ్రా : పదివేలండి.

రామ : యజ్ఞానికి పదివేలు!

2 వ బ్రా : అంతా లెఖవేశారు బాబూ.

రామ : లెఖకేం కొదవ — గతయజ్ఞానికి కాలువక్రింద పొలం లాభించికదా ఈయజ్ఞానికి యిల్లువస్తుంది — యింతేనా.

2 వ బ్రా : అలా అనకండి అన్యాయంగాను. చయనులుగారు సాక్షాత్తూ వ్యాసులవంటివారు. ఆయనకేంఖర్మం — న్యాయానికి కట్టుబడిగదా ఆయనకు ఉన్న పొలం ఆమ్మేసుకుని రుణాలుతీర్చుకున్నారు.

రామ : అప్పుడు పోయింది కనుకనే యిప్పుడు మళ్ళీ ఆర్జించాలి. ఏయజ్ఞం చేయకపోతే ఎల్లావస్తుంది? అయినా డబ్బులేని యీ కాటకపు దినాలలో యాగాలు గీగాలు ఎందుకండి?

2 వ బ్రా : దేశంలో యింకా ధర్మం నిలిచివుండాలంటారా.

రామ : ధర్మాలపేరుతోనే దేశాన్ని దారిద్ర్యంలోకి ద్రించారు.

1 వ బ్రా: వాళ్ళేంచేశారు?

రామ : ఏం చేసినారా — మేము చాలాగొప్పవాళ్ళం . మా మాటే వేదోక్తం - "బ్రాహ్మణో మమదేవతా" అని అనుకోవలెనని యిన్ని నీతిమార్గాలు చెప్పిన మననోటితోనే కూట సాక్ష్యాలు, మన చేతులతోనే ఎన్నో ఫోర్జరీలు, మనయిళ్ళల్లోనే ఎన్నో అమాంగల్యాలు. ఛీ! అధఃపతనం - మనదేశానికి కాదు, ముందు బ్రాహ్మణులకే.

2 వ బ్రా : అయితే చయనులుగారల్లా కాదులెండి. ఆయన చాలా సంప్రదాయకమైన కుటుంబీకుడు.

రామ : చయనులుగారి చిన్నకూతురు మీనాక్షమ్మ, ఆ వితంతువును ఎరుగుదురుగా - సాలుసరి రివాజుతప్ప లేదు. ఏం చెయ్యమన్నారు, చావమన్నారా? సోమిదేవమ్మ గారికీ తెలుసు. పదోయేట భర్తపోయిన పడతి ఆ

పాట్లు బడక యేం జేస్తుంది? అంతవరకు ఎందుకు? కొడుకుని సంస్కృత కళాశాలలో చేర్పించవయ్యా అంటే, వాడిమొహం వాడికి సంస్కృతం అక్కర్లే దంటాడు. కాని యెన్నిఉన్నా ఆయన యోగ్యుడు - అందుకనే యజ్ఞాలు, అందులోలాభాలు.

2 వ బ్రా: బాగుందండోయి - మీతో మాట్లాడడమే భయం నాకు. ఒకవేళ - అటువంటి అసందర్భాలు నాకేం తెలియవు - ఉంటే ఉన్నాయనుకోండి - దానికాయ నేం చేస్తాడు. ఎవరిజన్మపావనం వాళ్ళు చూచు కుంటారు. అలా అనుకుంటే ప్రపంచం అంతా దుర్మా ర్గులే ఉంటారా?

రామ: నేను దుర్మార్గాలు సన్మార్గాలకోసం అనడంలేదు. ఎవరిజన్మపావనం వాళ్ళు చూచుకోవటంలో స్వార్థ పరత్వం కనిపించటంలేదామరి?

బ్రా: స్వార్థపరత్వం యేముంది? సోమపానంచేత పితృ దేవతలు - ఇంద్రాదిదేవతలు హర్షించి, పునర్జన్మ లేకుండా కాపాడటంకోసమే ఇన్ని క్రతువులు.

రామ: రంభా సంభోగంమాట మరిచిపోయినారు —

రంభాశ్లేష సుఖమ్మునాసపడి యర్థంబెల్ల వ్యర్థంబుగా
దంభస్వాములు సల్పుయజ్ఞముల సత్యంబున్నదే; ఉత్త సం

రంభంబేయగుగాక, కామశమ నార్థంబైన భూలోకమం
దంభోజాస్యలు లేరెపెక్కు-రిట తద్వ్యాపార పారీణలై.

భగవంతుడానాకుస్వర్గప్రాప్తికలుగవలెఅనితనయొక్క-మోక్షంకోసమే క్రతువులు చేయడం యోగ్యమంటారా, లేక నిష్ఫలాపేక్షగ ప్రపంచంలోని అనంతకోటి జీవరాసులకు మంచి చేకూర్చటంకోసం తనయొక్క-శక్తిని సాకల్యంగా ధారపోసి, ఐహికాన్నుండి ఆముష్మికానికి ఏదో ఒక సాధనంమీద మానవులనుద్ధరించటానికి ప్రయత్నం చేయడం యోగ్యమంటారా? ఈక్రతువులకంటె నిస్సహాయుడికి శక్తికొలది సాయముచేయుట, జీవహింస చేయకుండుట, అసత్యమాడకుండుట మొదలగునవి ఆచరించినచాలును.

బ్రా: అందరికీ దుస్సాధ్యములయిన కర్మలను ఆచరించుటకు బ్రాహ్మణులు సంధానకర్తలుగా ఉండాలి — అయినా యిప్పుడు జీవహింస సందర్భంయేముంది.

రామ: యజ్ఞాలలో హింసారూపకమైన పశువును పట్టుట ఏ మహానీయుని చేతనైనా ఆచరింపబడినదా?

బ్రా: ఇదంతా యెందుకు- తమకు తోచినసహాయం యేమన్నా చేస్తారా?

రామ: సావంతు_యిదుగో సుశీలా! ఇనుపపెట్టెనుంచి యిర
వై రూపాయలు తీసుకురా.
(సుశీల విని లోనకు వెళ్ళును.)

పరదేశి: (ప్రవేశించి)
సాటిమానవుల కష్టముగాంచి కన్నీరు
చిందించు నోదయాశీలులార!
సంఘమాలిన్యమ్ము చక్క_జేయగ బద్ధ
కంకణులైన సంస్క_ర్తలార!
భువినాత్మవ త్సర్వభూతాని యనిధర్మ
పన్నముల్ బల్కు_ విద్వాంసులార!
దేశసేవాదివ్య దీక్షసర్వస్వమ
ర్పణసేయు జాతీయవాదులార!
కానబడరేమి నేడొక్క_రైన నెచట?
కాటి సుంకానికొకగుడ్డిగవ్వలేక
దేవులాడుచునుంటి మీ తెరవులందు
అయ్యయో! ఇంతకాఠిన్యమర్హమౌనె!!

పొలములుదున్ని, మండుకడుపున్ చెయిదాలిచి, కూలికోసమై
నిలిచిన తాలుపోలు కరణీకపు శేర్లకు మారబోసి, మా
కులము ధనమ్మునార్పి మరికోటులకున్ పడగెత్తునాడు నున్
తెలియరు కష్టమింతయు నిదేమిటి దోసమొ! పాపకర్మమో!!

బ్రా : ఒరే దూరంపోగా, మాలపల్లెలో మశూచి విషూచి వుంటుందన్నారు. నీకేం మతిపోయిందా యేమిరా యిలా బ్రాహ్మణవీధిలో పడ్డావు.

రామ : ఏమినాయనా అల్లావున్నావు. వదిగివదిగి నిలబడతా వేం? రా యిల్లారా.

బ్రా : మమ్మల్ని వెళ్ళిపొమ్మనా సూచన.

రామ : వాఁడు వస్తే మీరు వెళ్ళడంయెందుకు ?

బ్రా : ఇంకామేము బ్రాహ్మణీకంలో వుంటున్నామని అఘో రిస్తున్నాం గనుక.

రామ : మానవత్వం మొదటిదీ, బ్రాహ్మణీకం తరువాతదీ. సరే ఈమాటలకేం. ఏం పరదేశీ యిల్లావచ్చావు? మీఅమ్మకు ఎలావుంది?

పర : ఇంకేంఅమ్మ బాబుగారూ. అమ్మ దాటిపోయింది. ఆమెకు అంత్యక్రియలైనా చేయలేని అభాగ్యుడ నైతిని.

(కనులనీరు పెట్టుకొంటాడు.)

రామ : ఆహా ! కష్టతరంగదా కార్మికజీవనం. ఏంతండ్రీ యిం టివద్ద ఏమీలేదూ?

బ్రా : లేకేం. అంతా దొంగవేషం.

రామ : అట్లా అనకండి. కార్మికుల కష్టం తమకేమి తెలియును? ఊఁ.

పర : అమ్మవారికి బలులియ్యడంలో నేనేకీభవించలేదని నన్ను దూరంచేస్తున్నారు మావాళ్లు.

బ్రా : ఒరేయి పడుపుమొహంతో యిక్కడలే శుభంఅంటూ ఇంటిదగ్గర.

సుశీల : (ప్రవేశించి) నాన్నా-అమ్మ రెండురూపాయలు ఖర్చు చేసిందట. యిదిగో-అదేమిటి పరదేశియిల్లావచ్చాడు?

రామ : వాళ్ళఅమ్మ పోయిందట (పరదేశికై) ఇదిగో ఇది పట్టుకుపోయి పనిచూచుకో. ఆనకకనబడు.

సుశీల : శ్రీరామ రామ. కొంచెం ఆగికనబడితే బియ్యం పెట్టుతాంరా.

పర : చిత్తం సెలవు. విద్వాంసులారా సెలవు.

బ్రా : నడువద్దూ సంతోషించాంగాని.

( పరదేశి వెళ్లును. )

రామ : స్వామీ తమకెందుకండి యింతకాఠిన్యం?

బ్రా : ఎందుకా తమ మతభ్రష్టతకు.

రామ : మతభ్రష్టతయా.

బ్రా : కాదామరి ఎవరో మాలవాడికి డబ్బియ్యడమేమిటి? బ్రాహ్మణజన్మయెత్తి ప్రయోజనంయేమిటి? ఆచా

రాలు అప్పుడేపోయినవి. శాస్త్ర లోకానికయినా జడియండి.

రామ : కనికరంలేని ఆచారాలు కాల్పనా ?

బ్రా : మరి మామాట ?

రామ : కొంచెం తాళిరండి సర్దుతాను.

బ్రా : ఇంతసేపు చదువుకొన్న సంస్కారులను కూరోచ్చెబెట్టి రిక్తహస్తాలతో పంపివేయడమేనా — వాడియందున్న గౌరవం మాయెడ లేకపోయిందన్నమాట — చాలా సంతోషంగావుంది — ఇంకా లేవవేమిరా బుద్ధిలేక — అడిగేవాళ్ళకయినా సిగ్గువుండాలి.

రామ : కోప మెందుకండి !

బ్రా : రామనాధంగారి విజృంభణ లావయింది. గృహస్తులు-సంబంధ బాంధవ్యాలు పెద్దవి చేసుకున్నారు. ముందు ఆలోచించుకోండి.

(బ్రాహ్మణులు వెళ్ళేదరు.)

రామ : (సుశీలతో) మనంచేసిన అపచారం ఏముంది యిందులో.

సుశీల : అల్లాగేవుంది — ఈ ఛాందసులకోసం యింత బెంగ ఎందుకు — అదుగో అమ్మ పిలుస్తుంది వెళ్ళుతా.

రామ : నేనుకూడా వస్తున్నాను. (తెర).

ప్రథమాంకము — చతుర్థ రంగము.

స్థలం : స్వామినారాయణ తీర్థుల మందిరము.

సమయం : ఉదయం గం 8 లకు.

(తీర్థులు పీఠమునధిష్టించి యుండును. ఒకమూల పీఠము. ప్రక్క ఎత్తయిన దీప స్తంభము. కొంచెం దూరమున శ్రీకృష్ణవిగ్రహము- వింజామరవీస్తూ ఒకడు నిలువబడును. చుట్టు స్త్రీలు పురుషులు.

బ్రాహ్మణుడు : (ప్రవేశించి నడుముకట్టుకుని సాగిలపడి మ్రొక్కును.)

తీర్థులు : నారాయణ — దయచేయండి (అక్కడ కూర్చున్న చయనులుగారినిచూచి) ఎరుగుదురా వీరిని ?

చయ : చిత్తం — దనమటం తరఫున సగిలిపాయ సీమలో సభాపతిగా వుండేవారు గారా — అదే శృంగారం రంగాభొట్లుగారు.

రంగాభొట్లు : ఎవరువారు — పిడుగు అగ్నిహోత్రుడు చయనులుగారా. నమస్కారం — నమస్కారం—చాలా కాలమైంది — ఈమధ్య దృష్టికాస్త మందగించింది — క్షమించాలి.

చయ : అబ్బబ్బ ఎంతమాట — ఎప్పుడు దయచేశారు ?

రంగా : నేనా — నిన్న సాయంకాలం.

తీర్థ: ఇంటివద్ద అందరూ క్షేమమా — ఈమధ్య కష్టలేమీ లేవుకదా ?

రంగా: ఆకష్టలెల్లాగో సర్దుకున్నాంగాని, అంతకన్న మించిన ఉత్పాతాలు బయలుదేరినవి.

చయ: రజస్వలా వివాహాల సంబంధమేనా?

రంగా: అది సర్వసాధారణమే అయినదనుకోండి — దాన్ని తలదన్నిన గోల ప్రారంభమయినది.

చయ: ఇక్కడ స్థితిచూస్తే మీరేమంటారో - ఆ సహవాహానికి కొండలాగ స్వామివారు ఉన్నారు కనుక రోజులు నెట్టుకొస్తున్నాంగాని లేకుంటే యీవేళకు యీవత్తూ తలక్రిందులై యుండేది !

రంగా: సందేహమా.

తీర్థ: ఈశ్వరకటాక్షం — ధర్మం ధర్మమే — అధర్మం అధర్మమే — రెంటికీ పోరాటం బయలుదేరింది.

ఒకడు: (పంచాగం చదువుతాడు)
(జమాఖర్చులు) ప్రారంభ నిల్వ 4031—1—౦ వినాయకపురం మొఖాసాదారుగారు పంపినవి రాశం 2000. 687 నెం॥ పట్టాతాలూకు పొలంలో కొట్టించిన తాడిచెట్ల ఖరీదు 40 రూపాయలు ఖర్చులు

అచ్చు ఖర్చులు 60, ప్రసాదాల ఖర్చు 60, సాదరులు 140.

తీర్థు : సాదరులు యింత ఎక్కువయినదేమి ?

శిష్యు : పరువులకు పట్టుగలీబులు, దోమతెరలు, పరిమళ ద్రవ్యాలు సాదరులో చేర్చక ఏంచేయమన్నారు ?

ఒకడు : ఫోను నిల్వ 5781–14–9.

తీర్థు : పొలిమేరవద్దనున్న మామిడితోట విషయమేమైనది ?

ఒకడు : చిత్తం — రాగల సోమవారం వాయిదా - మనం గెలుస్తామని వకీలు చెప్పినాడు.

తీర్థు : గతనెల కాశీలోజరిగిన అద్వైత సభకు వెళ్ళిన అవధాన్లుగారికి రైలుచార్జీలు యిచ్చిరా?

ఒకడు : చిత్తం - మహాలక్ష్మమ్మగారి మరణశాసనంలో వ్రాసిన ప్రకారం - ఆమె మేనత్తకూతురు ఆయింట్లోంచి కదలలేదు - ఇంకాయిల్లు స్వాధీనం కాలేదు.

తీర్థు : రేపు చూద్దాం - ఇంకా ఏమైన గలవా ?

ఒకడు : లేవండి.

సుశీల : (తల్లితో) ఇంకా ఎంతసేపమ్మా-సన్యాసుల మఠాల్లో కూడా సర్కారు కార్బారు జరుగుతూ వుంటుం దన్నమాట.

రాజ్య : (రహస్యంగా) మాట్లాడకు. ఎక్కడికొచ్చినా నీ అధికప్రసంగం మానవు. వారువింటే ఏమనుకుంటారు?

చయ : (కొంచెం ముందుకువంగి చెయ్యి అడ్డంపెట్టుకుని) నిన్న తమకు మనవిచేసిన ఆమె వచ్చినదట — తమ సెలవయితే.

తీర్థు : (ఆలోచించి) ఎవరు ?

చయ : అధ్యాత్మంపాడే...

తీర్థు : సరి సరి కావచ్చు.

చయ : అమ్మా — యిలావచ్చి కూర్చోండి.

(ఒక స్త్రీ అధ్యాత్మం పాడుచుండును.)

(పద్మావతి -- సకేశ పూర్వసువాసిని — ఇవవై ఏండ్లు. ప్రవేశించి స్వామివారికి సమస్కరించి చిరునవ్వుతో సుశీలప్రక్క కూర్చుంటుంది. సుశీల స్వామివారిముఖం పద్మావతిముఖం చూస్తుంది.)

రంగా : ఆపదజటిలము, ఆశయ్యా పటుత్వము, ఆస్వారస్యము ఈకాలపు కవిత్వాలలో కనబడతాయూ — వారు వరకవులు అందుకనే వారి కవిత్వాలు యింతకాలం నిలిచి వున్నాయి.

చయ : ఈకాలంలో అధ్యాత్మం పాడేదెవరూ ?

శిష్యు : తాము సెలవిచ్చినట్టు అపనా తనామనా పాటముందర అధ్యాత్మం ఎందుకు?

తీర్థులు : విన్నారా — ప్రకృతియే కాలాధీనమైనప్పుడు భావములు మాత్రం అతీతము లెట్లగును? కాలం పరిణామాధీనం; భావములు అలాగే కాబట్టి కాలచక్రం అన్నారు. దానికి పరిభ్రమణం సహజం. శంకర భగవత్పాదులవారు
"దినమామిన్యౌ సాయం ప్రాతః । శిశిరవసంతౌ పునరాయాతః కాలఃక్రీడతి గచ్ఛత్యాయుః" అని సెలవిచ్చారు. దానిపరమార్థమేమిటి? పరిణామంలేనిది నిర్జీవపదార్థం — కాలం సజీవమైనది — భాషభావములు సజీవములు. కనుకనే మార్పులు తప్పవు జగత్తంటే తిరిగేది అనేకదా అర్థం.

చయ : చిత్రం — చిత్రం — గొప్పవిషయం సెలవిచ్చారు — ఈసృష్టిక్రమమే అవాఙ్మానస గోచరమైనది.

రంగా : కాదామరి - "చిత్రం చిత్రం బతబతమహచ్చిత్రమే తద్విచిత్రం" అన్నారండీ యీప్రకృతినిచూచి.

1 వితంతువు : మహానుభావులు - మహానుభావులు.

తీర్థులు : విన్నారా - చయినులుగారన్న సృష్టిక్రమమున్నూ తాముశలవిచ్చిన ప్రకృతీ ఒక్కటే. ప్రకృతి స్త్రీ

స్వరూపిణి. కాలమునకు పురుషత్వము చెప్పినారు- ప్రకృతి పురుష సంయోగ వియోగములే సృష్టికీ లయమునకు కారణాలు.

ుుగ- : ఏమి ఆత్మానుభవం - పూర్ణులు.

శిష్యు : పరిపూర్ణులు - అనుభవంలో మరి యింతటివారిని చూడమనండి - ఆవచ్చే ప్రతివాక్యూ అనుభవంలో నుంచి వచ్చేదేనండి - (పద్మావతి ముఖంచూచును).

పద్మా : (తలవంచుకొనును).

తీర్థు : విన్నారా - అద్వైతదృష్ట్యా 'తత్వమసి' అనండి. 'అహం బ్రహ్మోస్మి' అనండి - చైతన్యాదులు దీనినే మధుర భావమన్నారు - అదేగదండీ భాగవతం దశమస్కంధంలో ఉద్ధవపురుషకారం గోపికాకృష్ణ విహారలీల లున్నా - మధురానగరం అంటే ఏమిటి ? గోపికలతో కృష్ణుడు విహారించినాడంటే ఏమిటి ? అంటే - ప్రకృతి పురుషసంయోగమునకు మధురభావము పరిణామదశ అన్నమాట-జయదేవుని గీతగోవిందమంతా ఆమధుర భావముయొక్క పరిపక్వదశ గదండీ.

శిష్యు తాము సెలవిచ్చినట్లు - పద్మావతమ్మ అక్కయ్య గారు బహుబాగా పాడుతారు - స్వామివారి సెల వయితే సరి.

(చిరునవ్వుతో పద్మావతిని చూస్తాడు)
(సుశీల కనుబొమలు ముడిపెట్టి శిష్యని చూచును)

తీర్థులు : అవును అక్కగారు మనోహరంగా పాడుతారు. ఈ మధ్య నే ఎప్పుడో - మొన్న దేవీనవరాత్రములల్లో కాబోలు - మహిళాసమితివారి భజనలో పాడుతుంటే విన్నట్లు జ్ఞాపకం - ఇక్కడ క్రొత్తవారెవ్వరూలేరు - అందరు సోదర సోదరీ భావంతో వుండేవారు - ఇంతకూ భగవత్సన్నిధానం అక్కగారికి ఆక్షేపణ లేకపోతే...

శిష్య : అక్కయ్యగారూ పాడుదురూ.

చయ : ఏదీ కానీఅమ్మా మేము మీనాన్నగారి వంటివారమే.

రాజ్య : పాడుఅమ్మా పాడు - వారంతగా బ్రతిమాలుతుంటే.

వితంతువు : కానీఅమ్మా ఈపాపిచెవులకు వినుపించు.

సుశీల : (తల్లితో) ఏమిటమ్మా - స్వాములవారికి ఈమెమీద ఇంత అనుగ్రహం, చనవూనూ.

రాజ్య : అస్తమానం నీప్రశ్నలతో చస్తూవుంటానే - రామాయణం అంతావిని రాముడికి సీత ఏమవుతుంది అన్నట్లుంది. స్వాములవారు పూర్వజన్మజ్ఞానం కల వారు. పూర్వజన్మంలో ఈమే, స్వాములవారూ తోడబుట్టినవారు. చిన్నతనంలోనే స్వాములవారు

బ్రహ్మకపాలానికి కాబోలు తపస్సుకంటూ వెళ్ళి ఏమిటో తపోభంగం అవటంచేత ఇలాతిరిగి అవతరించారు. అంటూ చెప్పుకోగా వినవూ.

సుశీల : మరినాన్నగారు ఇంకోమో స్తరుగా చెప్పుతారే !

రాజ్య : అయ్యో - మీనాన్నగారు చెప్పడానికేమిటే - ఆయనకు దేవుడూలేదు దైవంలేదు.

వితంతువు : అమ్మాయి ఏమిటంటుంది ?

రాజ్య : దాని మొగంలెండి - అదో వెర్రిమాలోకం - దానికి అ స్తమానం సందేహాలే.

( పద్మావతి గీతం పాడుతుంది. )

తీర్థ : శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసంఫణిః అన్నారు.

శిష్యు : అందులో స్త్రీ గాత్రం - మీదుమిక్కిలి పద్మావతమ్మ గారిపాట అడుగవలెనా ఆనందం.

రంగా : నేర్చుకున్న పాటను తలదన్నినట్లుందండి - అమ్మాయి ఎవరూ ?

చయ : సిద్ధాంతి శ్రీధరశాస్త్రిగారి నెరగరూ వారి రెండవ కుమార్తె. పాపం వివాహంఅయిననెల దాటకముందే-ఇకఏమిచెప్పను అవాచ్యం.

రంగా : చు - చు - చు - (చప్పరించుచు) ఏదో ప్రాప్తం

మంచిదికాబట్టి మంచిమార్గాన పడ్డది. ఎంతటివారికి యిలాటివారి సాన్నిధ్యం లభించను ?

శిష్యు : సందేహమా - నిరంతరం ఆమెకు గురుశుశ్రూషా తత్పరత్వమేగాని మరి ఇకవేరే పనిలేదనండి. తాము సెలవిచ్చినట్లు స్వామివారికి కూడా ఆమెయందు అలాంటి భావమే కలిగింది.

1 వితంతువు : స్వామివారు క్షమించాలి - కర్మయోగాన్ని గురించి సెలవిచ్చారుకదా - కర్మపరిపాకం చెందితేనే గాని జ్ఞానంకాదన్నారు. కర్మ నశిస్తేనేగాని జ్ఞానం సాధ్యంకాదన్నారు. ఆధర్మసూక్ష్మం బోధపడటం లేదు. అడుగుదాం - అడుగుదాం అని గడుపుతున్నాను.

తీర్థులు : ప్రపంచంలో సర్వజ్ఞుడనేవాడెవడు ? ఆత్మను సాధినాశ్రయించి ఉన్నంతకాలం సంశయం తప్పదు. మనలో మనం తెలియని విషయాలను మధించుకోవడమేగాని ఇందు తెలిసినవారెవరు ? తెలియనివారెవరు ? “సతాంహిసందేహ పదేషువస్తుషు ప్రమాణమంతఃకరణప్రవృత్తయః” - అంటే - పెద్దలకు సద్విషయాలనుగూర్చి సందేహం కలిగినప్పుడు పరిష్కరించటానికి అంతఃకరణమే ప్రమాణము అన్నమాట.

2 వ వితంతు : అంతఃకరణప్రవృత్తిని కనిపెట్టే అవస్థఒకటి వుంటుందాఅండి.

తీర్థులు : స్వప్నజాగ్రత్సుషుప్తులకు భిన్నమైన నిత్యజాగృతాధిష్ఠాన నిరామయ నిర్వికల్పస్థితిలో ఆజ్ఞానం ఉద్దీపనం అవుతుంది.

సుశీల : స్వామీ - కులములు ఏర్పడటం జన్మమునుబట్టియా లేక కర్మమునుబట్టియా ?

తీర్థులు : జన్మకూ కర్మకూ విభేదం ఏర్పరుస్తున్నారు. అభేదాధ్యవసాయము కలిగినప్పుడు కర్మకూ జన్మకు అవినాభావసంబంధం ఏర్పడుతుంది - అంటే కార్యకారణము లన్నమాట.

క. "కర్మమున బుట్టుజంతువు
కర్మమున సమృద్ధిజెందు కర్మమున జెడుఁ
గర్మమెనరులకు దేవత
కర్మమె సుఖదుఃఖములకు కారణమధిపా."

(లోపల గంట వినబడును.)

శిష్యు : మంగళహారతి సమయం. అందరూ ప్రసాదానికి దయ చేయండి.

తీర్థు : (లేచి లోనికివెళ్ళును. అందరూ వెంటనడుస్తారు.)

( తె ర ము ం ద ర . )

రాజ్య : పద. మనం ప్రసాదంపుచ్చుకుని పోదాం.

సుశీల : ఆ - పుచ్చుకున్న ట్లేలేతూ - వెళ్ళుదాంపద.

రాజ్య : ఆలయ్యకు తగినబిడ్డవే - మాపాలిటి నిక్షేపంలాగ పుట్టినావు. ఒక పురాణమా పుణ్యకథా - చివరికి అక్కడ చేప్పేమాటలన్నా విననిచ్చావా - అక్కడా ప్రశ్నలే - వారేమనుకుంటారు.

సుశీల : ఎంత వెర్రితల్లివమ్మా - ఇంతదానవయినావు - లోకం ఏమిటో తెలుసుకోవు. ఈ పరివ్రాజకత్వాలేమిటి? ఈపరిధనాలేమిటి? ఈప్రణామాలేమిటి? ఈప్రసంగాలేమిటి? ఇదంతా వట్టి ఆడంబరమేగాని లోకానికి అక్కరబడేదేమన్నా వుందా?

రాజ్య : ఇదంతా అక్కరబడుతుందా? మాలమాదిగల సేవ జేస్తుంటే స్వర్గలోకద్వారాలు తెరుస్తారు - ఇకచాలు గాని ఆట్టేపేలకు ?

సుశీల : (చిరునవ్వుతో) నేనేంపేలుతున్నానే - అక్కడ కూర్చున్నంతసేపూ ఆస్వామిని చూస్తేనాకు వళ్ళు మండి పోయింది - అమ్మా!

జ్ఞానసమార్జనాపరత, సంసృతి బంధమువాసి, నిష్ఠమై
కానలముక్కు మూసికొని కాలముబుత్తురుగాక మానులీ
జానుగవాహనాది పరిచర్యల రాచబడాయి బొల్తురే
ఈనెటివేసగాండ్రకు యతీశ్వర పట్టమదెట్లు చెల్లునే?

రాజ్య : తెలిసీతెలియని పిచ్చివాగుడు మాను - ఆయన ఎంత వాడనుకున్నావు. ఆయన ఉపన్యాసం నీవు ఎన్నడన్నా వింటేగా తెలియడానికి. మహామహా పండితులంతా కిక్కురుమనకుండా వింటూఉంటే నీవుమహా పెద్ద ఆరిందాలాగు ఆక్షేపిస్తున్నావు- ఆయనకేంకావాలి. అంతా పరిత్యాగంచేశారు. విన్నావా - ఒక్కొక్కమారు యోగాభ్యాసంలో కూర్చుంటే రోజులు తరబడి కూర్చుంటారట - ఈమధ్య శ్రీశైల పర్వతంమీద శివరాత్రిదాకా చాతుర్మాస్య దీక్షచేసి వచ్చారట

సుశీల : జరుగుబాటుంటేసరి - శ్రీశైలంమీదా వుండవచ్చు- సిద్ధాశ్రమాలలోనూ వుండవచ్చు - పదుగురికి తెలిసే విధంగా పైహంగు లెన్నయినా చేయవచ్చును. దీనికి తోడు నీవంటి వెర్రివాళ్ళు కైవారాలు చెప్తుంటే లేని మహిమలన్నీ అభినయించవచ్చు. ఈయేనుగు లేమిటి - ఈపరిచారకులేమిటి - పడుచుపిల్లలకు పంచా

క్షురీమంత్రోపదేశాలేమిటి ? వెధవముండలతో వెకిలి ప్రసంగాలేమిటి ? ఇలాంటివాడు సన్యాసీని ఇది మరమూనా?

ఆసలడంగి, ద్వంద్వములకగ్గముగాక, మమత్వమేది, జి
జ్ఞాసువులై, కృతాత్ములగు సజ్జనమాన్యుల కొప్పునెందు స
న్యాసిపదంబు; స్వార్థపరులై పరవంచక వృత్తినుండు స
న్యాసులువీర లేడ? పరమార్థము బోధనసేయు టేడ నే?

నీయిష్టంఅయితే నీవువెళ్ళు. నేనురాను.

(వెళ్ళుతారుఇద్దరూ.)

---

# పతితపావన

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.



స్థలం : మాలపల్లెలో భజనమందిరం.

సమయము : ఉదయము.

(పరదేశి, శివదాసు — ఇతరమాలవాండ్రు)

అందరూ : (భజనచేయుదురు.)

పర : వెంకన్నా స్వామికి మంగళహారతి యివ్వరా.

వెంక : (మంగళహారతి యివ్వబోవును) చెప్పటానికి మరిచాను - మంగళారతికి కప్పూరం నిండుకుంది. గింజలు పట్టుకువెళ్ళితే కోమటయ్య, డబ్బుపట్టుకొస్తే యిస్తాం గాని గింజలకు ఎవడిస్తాడా? అని నానాతిట్లు తిట్టాడు.

పర : ఇవ్వకపోతే ఇవ్వకపోవచ్చుగాని తిట్టటం ఎందుకో? మనగతి అందరికి అంత అలుసయిందన్నమాట - సరే దీపపు సెమ్మెలో వత్తి అలిగార్తిలోవేసి వెలిగించి హారతియ్యి.

వెంక : (అట్లుచేయును)

అందరు : (లేచినిలుతురు)

పర : (ఒకగీతము పాడును.)

ఒకడు : (తాగినవానివలె కలిసి నటించును.)

పెద్ద : (ప్రవేశించి) మరేటి, నాకొక్కమాటసెప్పు - నీవత్తా నంటావా రానంటావా?

పర : తాతా! అంతా తెలిసి అడివిలో పడుతున్నావు - నా స్వభావం ఎరుగుదువు - నాకు యిష్టంలేని దానికి నన్ను రమ్మనడం ఎందుకు?

పెద్ద : నలుగురితోపాటు నారాయణా, కులంతోపాటు గోలుం దా - నీకంతకంతకు యేదాంతం ముదురుతోంది. నీపా శేనీదికాని నీకుతోచదు. ఒకరుచెప్పితే యినవు-నీకిష్టం లేకపోవడమేమిటంటా - ఆపతికి మొక్కుకొని అమ్మో్మా రికీ యాటపోతును యియ్యబోతున్న అంకాలుగాడితో నీవు అన్నమాటేందిరా ?

పర : అందరితో అనేదే ఆతనితోనూ అన్నాను. కాకపోతే యీమరంతమేమిటి చెప్పు. ఈక్షుద్రదేవతల పేరు చెప్పి నిలువునా అమాయికపు జంతువులను హత్య జేయడం భక్తికి లక్షణమా ? దయామయుడైన భగవంతునకు ప్రీతిపాత్రమవుతుందా ? మాంసపుతిండికి మరిగి మద్యమాంసములకు దాసులై ఈబలులు, జాతరలు, దేవతల పేరుతో కల్పించారుగాని—

హరిహరి ప్రాణిసంతతుల నార్వగ గొంతులుగోసి, నెత్తురుల్ ।
వరగ, శిరమ్ములన్ తనువులన్ మదిరమ్ము నివేదనమ్ముగా ।
జరుపుదు రీయనార్యులిటు జాతరలన్ బరిముక్తకేశులై ।
అరయ రహింసయే పరహితార్థ మహావిధియంచు నయ్యయో!

పెద్ద : ఓరి వుండరా ! — మామావోళ్ళు యీమాంసంకోసం కల్లుకోసం మాతిరుగుతూంటే, నీవేదో భెమ్మగ్యానం సెప్పొచ్చావు. యియ్యాల పెద్దజీవంతోలు కరేసి అమ్మి రూపాయి సంపాదించుకున్నా — అర్ధరూపాయకి తాగాను — అర్థరూపాయ మా మడిసికిచ్చాను. సంపాదన సట్టుబండలు లేక నీవుమాకు సెప్పొచ్చావు. సంపాదిత్తాం సమ్మంగా తాగుతాం. అసలు మన అయ్యోర్లో అణాడబ్బులిచ్చి తాగరా అంటుంటే...

పర : తాతా! — అయ్యవార్లు అణాలు యియ్యడం ఎందుకు? మనల్ని యింకా గోతిలోకి దిగవేయడానికి అది తెలియక అధోలోకాన్నే అమరలోక మనుకుంటు న్నాం — అజ్ఞాన లక్షణం.

పెద్ద : అదిగాదోస్ — ఆరిలో ఆరికి కట్టుబాటు ఎక్కువ.

పర : అట్టి కట్టుబాటు మనకూవుంది—

(లోపల తప్పెట్లుధ్వని)

పెద్ద : మరేటి సెప్పు — అంకాలుగాడు గుడికి బయలు దేరాడు. తప్పెట్లు మోగుతున్నాయి. వత్తానంటావా రానంటావా?

త్రాగినవాడు : అంకాలుగాడు తేగబోగరాయడన్నా — ఆరు కడవలు — అగ్గిలాంటి కల్లు తెప్పించుండాడు.

పర : అదిగో తాతా — మళ్ళీ అదేమాటా—ఉత్తమజాతులు కొబ్బరికాయలతో తమ మొక్కుబడులు తీర్చుకుంటు న్నారు. ఈ మొక్కుబడులతో తమకోరికలు సిద్ధిస్తా యనీ సిద్ధించవనీ అనే మాట అలావుంచు. లంచాలు పుచ్చుకుని లాభాలు కలుగజేసే దేవతలు దేవతలా? ఈ వెర్రినమ్మకాలకు ఈమూఢాచారాలకు హద్దు పద్దు ఏమైనా వుందా? బలులిచ్చిన వారందరూ బ్రతికి పోతున్నారా? ఎన్ని హత్యలు చేసినా, ఎన్ని జాతరలు

జరిపినా, అదేంకర్మమో ప్రతిరోగం, ముందు మన కొంపలనే చుట్టేస్తుంది. దీనికంతా కారణం ఏమనీ? మన మురికిబ్రతుకు, మురికి తిండీన్నీ.

పెద్ద : బ్యామ్మర్లూ, ఆల్లూ, కొబ్బెరకాయలే కోడకారంటవు కదా. మేనకోడలికి అమ్మవారు పోశుంటే మేకపోతును బలియిప్పించారుకారటరా కరణపయ్యగారు. ఆయువు లేక ఆమె సచ్చిందనుకో - ఆమాటఆమాటే. ఈమాట ఈమాటే.

పర : నీమాటలకి నవ్వూవస్తుంది, కోపం వస్తూంది. అయుస్సు ఉండేవాళ్ళకి బలులు అక్కర్లేదుకదా; బలులిచ్చినా ఆయుస్సు లేకపోయేవాళ్ళకోసం బలులు యియ్యడ మెందుకు? మానవులలో నీతి చాలా నీరసించింది. తాత్కాలికంగా పుట్టే ఆవేశంతో తూగులాడు తున్నాం. కరణంగారు బలియిచ్చారంటే ఆశ్చర్యం ఏముంది? తురకవాళ్ళ పండగలలో లాడేలు కట్టుకునే వాళ్లు, పిల్లలకోసం పీర్లకు మొక్కుకునేవాళ్లు బ్రాహ్మ ణులలోమాత్రం ఎందరులేరు?

పెద్ద : పెసంగం పెంచుతున్నావు. గుడికాడికి వత్తావారావా.

పర : నీవు వెళ్ళుదూ పెద్దవు చాలును.

(బోపల తప్పెటలధ్వని - వీరంగాలు మోతతో కల్లుకడవ తలపై పెట్టుకొని అంకాలు ప్రవేశిస్తాడు. ఇంకొకడు పసుపుకుంకుమ చేతపట్టుకుని నడుస్తాడు. గొర్రెపోతుకు వేపాకుమండలు తలకుకట్టి ఉంటాయి. ప్రక్కగా ఒకడు కత్తి చేతబట్టుకుని ప్రవేశించును.)

పర : (గొర్రెపోతువద్దకు వెళ్ళి) మానవులెంత స్వార్థపరులు - ఎంత కఠినకర్ములు - నోరుతారు ఎరుగని నిరపాయకరమగు జంతువును నిన్ను బలియిచ్చుటకు కొనిపోవుచున్నారా - అది అమ్మవారికి సంతృప్తియా - తమ బ్రతుకునకయి నిన్ను చంపుటయా - నిన్ను చంపినను మేము బ్రతుకుట నిజమా - నిన్ను సృష్టించిన భగవంతుని ఉద్దేశ్యమేమో, ఇట్లు కత్తికెరయగుమని నీనుదుట వ్రాసెనాయేమి? వ్యాఘ్రాది క్రూరమృగములను బలియొసంగరాదా? సాధుజంతువులకు క్షేమమగునే. నీవు మాకుగాని దేవతలకుగాని చేసిన అపాయమేమున్నది? ప్రతిజంతువు మానవులకేదోరీతి సాయము చేయునుగాని, మానవుడు ప్రతిజంతువుయెడ మారణకర్మమునకుద్యోగించుచుండెనే! కొంతకాలము తినుటకింతమేత వేసెననిగదా నీవు సంతోషముగా ఆత్మార్ప

ణముచేయ వెడలుచుంటివి. నీకుఉన్న కృతజ్ఞత మా కున్నదా - అయ్యా - అంకాలూ - నాప్రార్థన వినవా?

తాగినవాడు: యాందిరది - యీాధిలోఅడిగితే వోగాయిత్తం రాపానీండశె.

పర: తాతా - నాహృదయం బ్రద్దలగుచున్నది. నన్ను బలి పెట్టండి - నాశరీరం ముక్కముక్కలుగా చీల్చివేయండి- అన్యాయానికి ఒడబడకండి. దీని ఒక్కొక్క రక్తపు బొట్టూ మన ఒక్కొక్కకొంప కూల్చేస్తుంది.

పెద్ద: వుండరా - మెగ్రియేదాంతం - యెదవమొగం యెంకట రామయ్య.

పర: (గోగ్రిపోతునుచూచి) నీఆయుఃప్రమాణం యింత టితో సరియా - ఇక జాములో నీవగపడవుకాబోలు (కౌగలించుకొనును.)

తాగి: (పరదేశిని లాగిపారవైచును సమూహంసాగిపోయింది)

పెద్ద: జరగనీరా - అదునుకందుకుంటూ పద.

పర: తాతా — ఎల్లుండి అమ్మ పెద్దదినం — పెరుమాళ్ళ గుడివద్ద టెంకాయలుకొట్టి ప్రసాదం పుచ్చుకొని వత్తా మనుకుంటున్నాను. మనవాళ్ళందరూ రావాలి.

పెద్ద: మనల్ని ఆసందికి పోనియ్యండే.

పర : అభ్యంతరం వుండదులే.

పెద్ద : నీవన్నీ సెప్పుతావు — మనం యెల్లితే బతకనిస్తారా ? పోతే పానాలకు తెగించేపోవాలి.

(లోపలనుంచి ఒకడు ప్రవేశించి) కొంపలికి సేటొచ్చింది — కొంపలికి సేటొచ్చింది. మన పరదేశిగాడిమూలానా — లెగండి — లెగండి ఆడిని ఎల్లగొట్టండి.

పెద్ద : యేందిరది. కల్నీల కై పుతలకెక్కి కలవరిత్తుండావా యేమిటి?

ఒకడు : మనకులాన్ని సంపెయ్యడానికి యీడు పుట్టాడు.

పెద్ద : అదేందో సెప్పోయి — గోలెట్టక.

ఒకడు : యీట్టా దేవుడోరి దగ్గరకెళ్ళి ఆ యిగ్గరాలు ఆళ్ళ నందరిని మైలెట్టడానికి సూత్తున్నాడంట — దమ్మ కర్తలోరు యీడిని ఎల్లగొట్టుతారా ? మీపాణాలు తీసెయ్యమా అంటున్నారు.

పెద్ద : అరెబాబూ యిదేందిరో.

పర :

గుడులున్, గోపురముల్ భజించుటకు మీకున్నాకునున్ దేవుడొ
క్కడె యంచున్ తలపోయరాదె? ఇటులాకల్పమ్ము దైన్యమ్ముతో

బడిచావం లిఖియించెనో యడుగపాపంబేమి? యీమాత్రకే
జడియంబోకుడు ప్రాణ, మాన, ధన సంసారమ్ములున్ గూలినన్

రేపొకవేళ మీరు కలలోకివచ్చారు మిమ్మల చంపేస్తా
మంటే చావవలసినదేనా మనగతి?

పెద్ద: ఇదేందో మనం చావటానికిపీల్లేదు బతకడానికిపీలులేదు.

నాయుడు: (ప్రవేశించి) ఏంరా తాతాయి – ఏంచేశారు?

పెద్ద: బాబూ ఆరుకడాపట ఏంసెప్పారు?

నాయుడు: మీగూడెంలో ఉంటున్న పరదేశిని గూడెంనుంచి తరిమివేయండి - అలాచేయకపోతే బలవంతంగా తరిమించేయటమేగాకుండా మాపనుల్లోకి మిమ్మల్ని రానీయం అని.

శివ: (ప్రవేశించి) ఏవయ్యోయి.

పెద్ద: ఈడెక్కడనుంచి వచ్చాడురో.

శివ: ఉండవయ్యా - ఏమయ్యా! మీవూరికి మతాధికారి వస్తే మేం దేవుణ్ణిచూడగూడదేం - మాతోమాట్లాడ గూడదేమరి మాయిళ్ళకెల్లావచ్చారు?

పెద్ద: అంతేనా, మా ఆడోళ్ళకేసిచూడొచ్చా - ఎకసికాలాడొచ్చా - ఊదుపుల్లో, కోతల్లోనూ, గడ్డిమోపుల

కాడా, మాయంటుండొచ్చా - మీయిట్టం అయితే సరా ?

నాయుడు : ఎవరుచేశారాపనులన్నీ.

పెద్ద : ఎవళ్ళా - అళ్ళే - ఆయీాదికిరండి సూపుతా. మామో పెద్దోళ్ళు - ఆసికాలాడతారు - ఒరే మనకాఫ్రాసెం దుకు ? ఆళ్ళగొడవ ఆపేసి నువ్వొయింటో కూకుండరా దటరా - ఆళంతా ఒహటె - బాబూ అలాగే సూద్దాం యెల్లండి.

నాయుడు : (వెడలిపోవును.)

పర : నావల్లవారేదురంతం కనిపెట్టిరో నాకోసం మీారు చిక్కు పడవద్దు. నేనెక్కడనో కాలం వెళ్ళబుచ్చుకుంటాను ! సంఘాన్ని బాగుపరచుకొని మీరంతామానవులపించు కుంటేచాలు. అది నాతపస్సుకు ఫలంఅనుకుంటాను.

పెద్ద : యింత నోరుచచ్చినోడివయితే ఎల్లాగ - నీపుణ్యమా అని ఆసుంకడికి అదేంటె ఉపదేశించావో ఏంటో ఆడు కల్లుముట్టడు - వాడియిల్లు అచ్చం బ్యామ్మర్లదిలా గుంటుంది. తొందరపడకు - రామనాథం అయ్యగారి సలహాచేద్దాం. లెగరా. ముంచుకుపోయిందేముంది -

(లోపల) తాతాయ ఉన్నాడటే.

పెద్ద : అయ్యా వత్తుండానండి.

రామనాథం : (ప్రవేశించి) ఏరా తాతాయా — మన మేడి పంపుచేనికి కళ్ళం ఎక్కడ ఏర్పాటుచేశావు? క్రితం ఏటికంటే యీసాలు పంట కాస్త జబ్బుగా కనబడు తుంది ?

పెద్ద : అవునండి ముంపు వచ్చింది — ఇవాళ్లో రేపో సూశి కుప్ప కొట్టిత్తాలెండి.

రామ : (పరదేశితో) ఏమోయి — మీఅమ్మ దినవారక్రియ లన్నీ చక్కగా సాగించావా — గణపతిశాస్త్రులవారు జాబువ్రాశారు. ఆశ్రమంలో నీవులేకపోవడం చాలా కొరతగా వుందనీ పాఠాలు ముందు జరిగిపోతున్నవనీ వ్రాశారు.

పర : ఎల్లాగూ వెళ్ళవలసి వచ్చిందిలెండి — స్వాములవారు నన్ను మాగూడెంనుంచి వెళ్ళగొట్టవలసిందనీ లేకుంటే యీ గూడెంవారిని దండిస్తామనీ ఫర్మానాయిచ్చారు.

రామ : అహ! — ఒరే తాతాయి! ఇది ఒకవిధంగా పరదేశికి ఉపకారమేగాని మీసంఘానికిమాత్రం అపకారం జరుగుతుంది — వాళ్ళు వెళ్ళగొట్టమనేవాళ్ళు, మీరు

వెళ్ళిపోయేవారూనా? ఏమిటి. ఈ నిరంకుశపు ఫర్మానాలు? వీళ్ళ ఫర్మానాలు లెక్కపెట్టే వారెవ్వరు? ఈమధ్య ఆదిభట్లకవి పుట్టయ్యగారి కోడలేమిటో చేసిందని యిలాగే బహిష్కార పత్రికతో పాతిక రూపాయలకు అంటుయిస్తే, అంటు లేదు గింటు లేదు సరిగదా పరాను పేటలో బల్లకట్టిందట — ఎందుకు చెప్పొచ్చానంటే, మఠాధికారుల ఫర్మానాలమచ్చు యిల్లా అఘోరిస్తుందని — అదేమిటిరా, చదుకున్నవాడు సంఘానికి యింత ఉపయోగపడే సాధువు, పదిమందిలో ఔననిపించుకునే వాడు పరదేశిని వెళ్ళగొట్టడమేమిరా — వాళ్ళలో సాధువని స్వాములవారికి సాష్టాంగంపడితే మీరు పరదేశిని పొరుగూరుపంపుతారా? మీరు పలక్కుండా వుండండి వాళ్ళింకా ఏదారికొస్తారో.

పెద్ద: సిత్తం — అంతకూ మీరేమాకు తల్లిదండ్రులు.

రామ: వస్తా. (నిష్క్రమించును.)

పెద్ద: ఏరా — ఇంతకూ ఏమంటావు?

పర: నా ఆశయం రెండుమాటలలో చెపుతానువిను- నీకే గాదు మన కులానికంతకూ.

అన్యమాంసమున నిజాంగమాంసంబు పో।
షింతు ననుటకంటె చేటులేదు ;
మాంసభక్షణము మానుటకంటెను ।
మేలులేదు కర్మజాలకమున .
అన్ని తపములకును పెద్ద ; అన్నిదాన ।
ములకు నెక్కువ ; అన్నినోములకు హెచ్చు
అన్నితీర్థమ్ములకును కన్నా కునిజము ।
భూతదయ ; దానిమించు ధర్మమునుకలదె ? (తెర)

---

ద్వితీయాంకము — ద్వితీయరంగం.

స్థలం : శంకరరావుగారియిల్లు—సమయము : ఉదయము.

(శంకరావు భగవద్గీత పారాయణం చేసుకొంటున్నాడు. ముందర వసారాలో కొడుకు రాజశేఖరం పుస్తకం చదువుకొంటున్నాడు. చిన్న ఎత్తుపీటమీద కప్పులో టీ పోసివుండగా దానిని తాగుతాడు.)

శంక : అదేవద్దన్నాను - అస్తమానం టీ తాగితే అత్యుకటపో తాడు. ప్రొద్దున లేచిన దగ్గరనుంచీ రాత్రి నిద్రపోయే పర్యంతం ఏక టీ - టీ - ఒకటేగోలాయె - ఎంత కాలేజీలో చదువుతుంటే మాత్రం.

రాజ ; ఉత్తర హిందూస్థానంలో, నాన్నా ! చలిదేశంకాదూ. టీ తాగితేనేగాని బుద్ధి పనిచెయ్యదు. అక్కడిరిక్షా లాగే వాడిదగ్గరనుంచి మహారాజువరకూ టీ తాగ వలసిందే_

శంక : అయితేమాత్రం - కాశీలో చదువుకుంటుంటే కప్పు తరవాత కప్పు టీ తాగుతుండాలసిందే - మహామహా వాళ్ళను చూశానుగాని యిదేమి నాతండ్రి ! ఎక్కడా చూడలేదు.

రాజ : (సిగరెట్టు వెలిగించును.)

శంక : ఇదొకటి- దానికితోడు యిదొకటి - ఇది మనిషిని పూరాగా పీల్చేస్తుంది - సంధ్యావందనం యేడుస్తున్నాను. కాశ్ఛేపు ఊరకుందూ-అయినా, యం. యే.లోకివచ్చిన తరువాత మరీ పాడయిపోయావురా - వాళ్ళ శేషగిరి చూడు-ప్రొద్దున్నే చద్దిఅన్నం, స్నానం, సంధ్యా, ఎంత శుచీ - రుచీ.

(లోపల) శంకరరావుగారు ఉన్నారా అండి.

శంక : రామయ్యా ! ఇదోవస్తున్నా - అయిందిలే "స్వస్తిః ప్రజాభ్యః పరిపాలయంతాం" రా - యిల్లారా రామయ్యా - కూర్చో.

రామ : (ప్రవేశించి కూర్చొనును)

శంక : ఏమైనా కృతికూడిందా?

రామ : లేదండి - వ్యవహారం అంతకంతకు బిగుస్తున్నది. ఎంత యినాసరే, యీమూడుతాలూకాలు ఏకబిగిని పాడ కానికి నిశ్చయించుకున్నారు. సారాదుకాణాలు వది లేసి కల్లుదుకాణాలన్నా మనం పాడుకుంటే ఒక మో స్తరుగా వుంటుంది. వాళ్ళందుకు ఒప్పుకునేటట్లు లేదు.

శంక : శ్రీరామరామేతి. ఇంకా రేపటిదాకా గడవుందికదా - ముప్పదియేండ్లనుంచి అడ్డంవచ్చినవాళ్లులేరు. ఈకాలా నికి తగుదుమని వచ్చారు. శ్రీరామరామేతి - సాయం కాలం ఏమాటా నాకువచ్చిచెప్పు - ఇదిగో ఈసంవత్స రం ఎంతపెరిగినాసరే - కొంతనష్టం అయినాసరే, యిజారామాత్రం చేయి వదలకుండా చూడాలి.

రామయ్య : అల్లాగేలెండి - డబ్బుదగ్గర వెనకాడేరుసుమీా - డిపాజిట్టుమొత్తం.

శంక : జాయంటువ్యాపారం చేస్తూంటే డబ్బుకోసం తారట్లా డితే లాభంఏమిటి - మరేం ఫర్వాలేదులే.

రామ : ఎప్పుడో అబ్బాయిగారు వచ్చారే - కులాసాబాబూ!

రాజ : ఆ - కులాసాయేనండి.

రామయ్య : నిన్న మీటింగుకు శంకరరావుగారూ - పదిమంది అయినా లేరేమండీ - స్వాములవారు చెప్తారన్నా రాలేదు.

రాజ : ఒక ప్రక్క దేశభక్తులంతా అస్పృశ్యతా నివారణంఅని ఆందోళన చేస్తుంటే సనాతనసభకు, స్వాములవారి ఉపన్యాసానికీ ఎవరొస్తారు?

శంక : వాళ్ళ మోహం - వర్ణసంకరానికి తలపడ్డ యీసంస్కరణాన్ని రూపుమాపేస్తానంటేనమ్మండి - నలుగురు రౌడీలను కమ్మించానంటే వీళ్ళ యెముకలు చూర్ణంచేస్తారు. సనాతన సమితికి శక్రటరీ ఏదుస్తున్నానంటే అప్రయోజకుడిగా భావించకోయీ రామయ్యా !

రామ : సరే ఆగొడవ అంతా మాకెందుకండీ - ఇటు పారాయణాలు అటు యిజారాపాటలు - వారంతవారు మీరు మీ అంతవారు వారు. రాజశేఖరంగారి కేమైనా కార్యం తలపెట్టినారా ?

రాజ : రామయ్యగారూ - మీరూరకుందురూ.

శంక : వాడి ప్రాణానికి అనుశీల ఒకరంభా - ఊర్వశిలాగుంది. ఆరామనాథం కొంపఅంతా మాలకూడయింది. ఇక వాళ్ళకూమాకు అతకదు - యీదిక్కుమాలిన సంబం

ధాన్ని కలుపుకుని కులభ్రష్టతకూడా ఎక్కడ తెచ్చు కోం? శ్రీరామరామేతి. వాడికారామనాధానికి చెడ్డ కాలం ప్రాప్తించింది - ఆకూతుర్ని అల్లా తయారు చేశాడు - అది అంగడాలగొడ్డయింది - భయం భక్తి లేకుండా ఎగిరెగిరి ఉపన్యాసాలివ్వడానికి తయారయింది. హద్దులో వున్నంతవరకూ ఆడదానికి గౌరవంకాని హద్దుమీరినతర్వాత చెప్పేదేమిటి - ప్రేమా యతనం అంటూపెట్టి మాలమాదిగపిల్లలను తాకుతుంది - శ్రీ రామరామేతి - తనకుగానప్పుడు ఏపట్లో కలిస్తేమనకేం?

రాజ : వారి పరోక్షంలో నిందించటం అట్టేబాగుండదు.

శంక : అదిగో వాళ్ళపేరెత్తితే వ్రాసుకువస్తాడు. సంవత్సరం క్రితం చిలుకకు చెప్పినట్లు చెప్పాను, యీసంబంధం తెగిపోయినట్లే అని - అంతకువస్తే భరణంపారేస్తాం - నీవు ఊఅను - ఎదిగినపిల్ల - చక్కనిది. జిల్లామునసబు కూతురు- యిస్తామంటున్నారు - నామాట అటుంచు తనతల్లి ఎంత బ్రతిమాలింది?

రాము : మీఒత్తిడికి ఆగలేక మీభార్యాగారు కొడుక్కి చెప్పి ఉంటుందిగాని తోడబుట్టినవాని కూతుర్ని వదిలేసి, వేరే

అందులో పెళ్ళిమీదపెళ్ళి - చేసుకోమని ఏయిల్లా లయినా చెప్పుతుందాఅండి?

శంక : శ్రీరామరామేతి - నీవలాఅంటే ఏంచెప్పను ? ఎంత తోడబుట్టిన వాడయితేనేం - చివరికి కడుపునపుట్టిన కొడుకయినాసరే కానిపనులు చేస్తూ, మతవిరుద్ధంగా ప్రవర్తిస్తే ఎవరు సహిస్తారయ్యా !

రామ : అబ్బాయిగారు, చిన్నవారు ఏంమాట్లాడతారు మీ ధూంధాములముందర - పంతులువారూ ! నేను చెప్ప గలవాడను కానుగాని - వాళ్ళకుటుంబం పవిత్రమైనది. ఆఅమ్మాయి గుణవంతురాలు - వాళ్ళేదో నమ్మిన దానిని ఆచరిస్తున్నారనుకోండి - కార్యం చేసేసుకుని అమ్మాయిని యిల్లుచేర్చుకోండి.

రాజ : (లోపలికివెళ్ళును)

రామ : అంతేగాని ఆసంబంధం వదలి వేరే పెళ్లిచేస్తామని మీరు తరచు అనటం నాకేం బాగాలేదు. మనపిల్లను మనం తీసుకొచ్చింతర్వాత వాళ్ళగొడవ మనకూ మన గొడవ వాళ్ళకూ అక్కర్లేదు- గొప్పమనస్సు చేయండి- దీర్ఘంగా ఆలోచించండి.

శంక : రామయ్యా - నీవు చాలా తొందరపడుతున్నావు - దానిలో అంతర్యాలు చాలావున్నాయిలే - పద - చెపుతా.

(ఇద్దరు పైకివెళ్ళుదురు). (తెర.)

---

ద్వితీయాంకము – తృతీయరంగము.

స్థలం : తీర్థులమందిరము—సమయం : ఉదయం ఏడుగంటలకు.

(తీర్థులు ఒంటరిగా)

ఎంతనిష్ఠగా ఉందామన్నా, అదేమి పాపమోగాని కాఫీఅయినా మానుదామని చూస్తే, అదిమానితే ఈఉపాధి అసలు నడిచేమార్గం కనబడుటలేదు. తెల్ల వారి గంటఅయినా కాలేదు. అప్పుడే కాఫీకై సహ స్రనామజపం చేయవలసిన అవసరం కనబడుతున్నది.

శిష్యుడు : (కాఫీ ఫలహారములతో ప్రవేశిస్తాడు) స్వామివారికై పద్మావతి అక్కగారు పంపుతున్న కాఫ్యాదులు.

తీర్థులు : పద్మావతి వచ్చియుండెనా ! ఏది ? ఆమెవది ?

శిష్యు : ఫలహారంయిచ్చి అప్పుడే తుర్రుమని పారిపోయిందండి. అంత భయమేమిటండి ? కొరిత్తా ?

తీర్థు : ఉండమనకపోతివా ?

శిష్యు : (వినిపించుకొనక) కాఫీఎంత ఘుమఘుమగా ఉందను కున్నారు.

తీర్థులు : (పరధ్యానంగా) అయితే పద్మావతి నావిషయంలో ఏమన్నా ప్రశంసించిందా ?

శిష్యు : నిజంగా ఆ రవ్వకేసరిలో ఎంతరుచి పెట్టిందండి, ఆ పద్మావతి అక్కగారు !

తీర్థులు : రావటానికి యిబ్బందిగాఉంది, చేసింది, అని ఏమీ అనలేదుగదా పద్మావతి !

శిష్యు : (అది వినిపించుకొనక) చిట్టిగారెలుమాత్రం తక్కువ రుచిగా ఉన్నాయాఅండి. దాని తస్సాగొయ్యా, చూస్తేనే నోరూరుతోంది.

తీర్థులు : పద్మావతి యిక్కడకు ఫలహారం తేవడం ఎవరూ చూడలేదుగదా !

శిష్యు : చూడాలేదు, ఏమీలేదుగాని - స్వామీ ! ఫలహారం పుచ్చుకోందురూ - కాఫీ చల్లారిపోతూన్నది.

తీర్థులు : (పుచ్చుకొనుచు) పద్మావతి యీరాత్రి ఏమన్నా వస్తానని చెప్పి వెళ్ళిందా ?

శిష్యు : ఈవేళ ఎందుకువస్తుందండి ? ఈరాత్రి ప్రోగ్రాం ప్రకారం రావలసింది రామాబాయి. నేడు శుక్రవారం గాదటండీ ! నేను మీప్రోగ్రాం అప్పుడే మరిచిపోయాననుకున్నారా ఏమిటి ? సోమవారం సోమేశ్వరి. మంగళవారం పద్మావతి. బుధవారం పుణ్యవతి. లక్ష్మివారం నాగరత్నం. శుక్రవారం రామాబాయి. శనివారం శాంతకుమారి. ఆదివారం విశ్రాంతి.

తీర్థు : (కాఫీత్రాగుచు) నిజంగా కాఫీబాగుంది. ఆధ్యాత్మిక విషయాలలో కృషిసలిపేవారికి యిది దివ్యౌషధం అని చెప్పవలసినదే.

శిష్యు : అయితే స్వామీ— తత్వబోధ గ్రహించటానికి కాఫీ పరమౌషధమని ధన్వంతరివారు సెలవిచ్చారాఅండి?

తీర్థు : ఇటువంటి చిల్లరవిషయాలమీద ధన్వంతరివారు అభిప్రాయం సెలవిస్తారా ? ఇవి అనుభవంమీద తేలే విషయాలు.

శిష్యు : నన్నుగూడ అలవాటు చేసుకొనమని సెలవా ?

( లోపల — స్వామీ ? )

శిష్యు : రామోజీగారి ధ్వనివలెఉన్నది !

తీర్థు : ఇదిగో ఇది వెంటనే లోపలపెట్టు. ఊ ! చూస్తావేమి?

శిష్యు : పరమార్థజ్ఞానం సంపాదించడానికి వచ్చే భక్తులకు తమ కాఫీ సంస్కారవిషయం తెలిస్తే తప్పేముందండి ?

తీర్థ : శాస్త్రచర్చ నాకు వదలి శిష్యరికం విషయం ఆలోచించు. ఇవి అన్నీ తీసివేయి. ఏమీ ఉండగూడదు. (శిష్యుడు వెళ్ళుచుండగా) ఇదిగో నాముఖంమీద ఏం కాఫీ మరకగాని ఫలహారం ఆనవాలుగాని లేదుగదా !

శిష్యు : మరకాలేదు గిరకాలేదు. కావాలంటే తాము ఫోటో తీయించి చూచుకోవచ్చు.

(శిష్యుడు వెళ్ళి తిరిగి రామోజీ, చయనులు రంగాభొట్లుతో ప్రవేశిస్తాడు.)

తీర్థులు : నారాయణ. నారాయణ.

అందరు : (సాష్టాంగ నమస్కారంచేస్తారు.)

తీర్థ : క్షేమమేగద ?

రామో : తమదయవల్ల.

రంగా : తమకు సంతానం ?

రామో : లేదండి.

చయ : రామేశ్వరం వెళ్ళారు. రాత్రిరాత్రికీ మొక్కారు. నాగప్రతిష్ఠలేమిటి ? లక్షవత్తి పూజలేమిటి ? ఉపవాసాలేమిటి ? వ్రతాలేమిటి ? అన్నీ చేయించారు.

శిష్యు : స్వాములవారివద్ద యింత తీర్థం యిప్పించకపోయారూ?
రంగా : పాపం. పున్నామనరకం పోవాలని యింకామీరు పూర్వాచారంలో ఉండటంవల్లగాని, యిప్పటివాళ్ళు సంతాన నిరోధాలనీ, చట్టుబండలనీ యేడుస్తారు.
తీర్థ : నిరోధించడమేమిటి? ప్రకృతిని నిరోధించుట ఎవరిశక్యం?
శిష్యుడు : కడుపు పండలేదని యేడ్చేవాళ్ళు లక్షలుంటే యీ దిక్కుమాలిన కడుపు ఎందుకువచ్చిందిరా భగవంతుడా అని యేడ్చేవాళ్లు కోట్లు ఉన్నారు.
రామోజీ : మాయింట్లోకూడా అవి ప్రదక్షిణాలుగావు. ప్రాణాలుగావు. ఏకాదశీనియమాలు, ద్వాదశి సమారాధనాలు జరుపుతూ కంటికి కడవెడుగా ఏడుస్తున్నదండి. అయితేనేం ఆమంచిరోజు రాలేదు.
చయ : ధనద్రవ్యాలకు లోటులేదు, ప్రతివాడి జీవితానికీ భగవంతుడేదో కల్పిస్తాడండి.
శిష్యు : వేరే వివాహప్రయత్నం చేయకపోయారూ?
రంగా : నాబోటి అష్టదరిద్రునకు ఆరుగురు పిల్లలు. పోనీ ఎక్కడన్నా దత్తత ఆలోచించకపోయారూ? అదొక ఆనవాయతి ఉంటుందని ఆడవాళ్ళు సామాన్యంగా అనుకుంటారు.

శిష్యు : లోపం ఎక్కడున్నదో తెలిసికోనేవరకు ప్రయత్నాల వల్ల ప్రయోజనం లేదండి.

తీర్థు : దత్తత ఎప్పుడూ తప్పేననుకోండి. సుఖాన ఉన్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టుకోవటం అన్నమాట.

రామో : రాగల శుద్ధ ఏకాదశినాడు, తమతో మనవిచేసిన—

తీర్థులు : (ఆలోచనతో) నారాయణ! సరే.

రామో : (నమస్కరించి) సెలవు.

(రామోజీ వెళ్ళుతాడు)

రంగా : స్వామీ? రామనాథం, పరదేశికిన్నీ ఇతర మాలలకున్నూ, గుళ్ళోకి వెళ్ళితే తప్పులేదని ఉదయాన్నే కబురంపించాడట. నేడోరేపో వారంతా కోవెలలోకి వస్తారట!

తీర్థు : ఏమీ? శ్రుతిస్మృతి పురాణేతిహాసాలను బ్రాహ్మణులే అతిక్రమించటం! నారాయణ! నారాయణ!!

రంగా : 'నేనున్నాను. ఫరవాలేదు. సాహసించండి' అని కూడా పురిగొల్పినాడటండి.

తీర్థు : (కోపంతో) ఏమి? ఇక్కడ మఠాధిపతి లేడని తలచెనా? బ్రాహ్మణులందరూ కులభ్రష్టులైరని ఎంచెనా?

చూచెదగాక. (ఆచార్యులు ప్రవేశించి, సాష్టాంగ ప్రణా మంచేసి)

ఆచా : స్వామీ ! ఇంకేమున్నది. పాతగూడెం పంచముడు ఇతర మాలలతో గలసి రేపుఉదయం స్వామిదర్శనానికి వస్తాడట ! మీరే మమ్ములను రక్షించాలి.

తీర్థు : మనద్వైతాద్వైతాలు యిప్పుడు చాలించాలి. పంచములు ప్రవేశిస్తే దేవాలయం మలినమైపోతుంది. దేవతాసాన్నిధ్యం అపవిత్రం అగుట మనము ఎన్నడూ హర్షించరాదు.

ఆచార్యులు : తమ ఉపకారం మేము ఎన్నడూ మరచిపోము. స్వామీ ! (తిరిగి సాష్టాంగపడును.)

చయనులు : ఆర్తరక్షణ అంటే ఇదేగదా !

తీర్థులు : (నిశితంగా) మనం అగ్రజాతులవారం. 'బ్రాహ్మణో మమదేవతా' అని సాష్టాంగాలు పొందవలసినవారం, ఇదంతా వారికి కైవసంచేస్తే మన ఆధిక్యత ఏమున్నది? సామదానభేద దండోపాయముల, మనం జయంపొందే వరకూ మనప్రాణాలను అర్పించాలి. ఇప్పుడు దండోపాయమే సమంజసమనుకుంటాను.

(అందరూ నిశ్శబ్దంగా ఉంటారు.)

నిజంగా మీరు పందలే అగుచో, రేపటినుండి మీకు అన్నోదకాలే అక్కరలేనిచో మిన్నకుండండి. లేదా — వారినందరిని డీకొని తుత్తునియలు చేయండి, ఊఁ! పొండి! ఇదే నా సందేశం!!

(లోపలికి వెళ్ళుతాడు.)

( తెర. )

---

ద్వితీయాంకము — చతుర్థరంగము.

స్థలం : కోవెలవీధి. సమయం : ఉదయం.

[పరదేశి, శివదాసు, మాలపెద్ద, ఇతర మాలవాళ్లు భజన చేసుకుంటూ చేత టెంకాయలతో ప్రవేశించారు.]

ఆచార్యు : (ఎదురుగావచ్చి) ఒరేయి!

పర : స్వామీ! దండములు — స్వామివారి ఊరేగింపు ఇంకా ఎంతసేపటికి ?

ఆచా : కొంతసేపటికి నీకెందుకు ?

పర : దర్శనం చేసుకుని...

ఆచా : నోరుముయ్యి - అపాచ్యుడా! అంతవాడవయ్యావూ?

పర : ఏమిస్వామీ ?

ఆచా : స్వామి యేమిటి నీచట్టుబండలు ?

శివ : మాకూ మీావలెనే కళ్ళు లేవూ ?

ఆచా : ఇంకేం ? గుళ్ళోకిరా - బుద్ధిలేక వాగుతున్నావా ?—
బుద్ధిచెప్పిస్తా - నోరుమూాయిస్తా - తొందరపడకు.

పర : అయ్యా! మా దాసు పిన్నవాడు - మేము స్వామివారి ఊరేగింపు వేళకు దేవదర్శనం చేసుకుని, కాయకర్పూరం సమర్పించి వెళ్ళుతాం - మేము వీా ఆలయంలోకి రాము. అంతఅర్హత మాకు లేదింకా - అది మాకు తెలియును.

ఆచా : వీడికి వేదాంతం అంతా అబ్బిందే వీడిని తగలెయ్య !

పెద్ద : యహ ! సూాత్రారేందిరా?—

పర : వద్దు. తాతా ! వద్దు, జొర్జన్యంవద్దు—

ఆచా : ఒరేయి !—ఉత్సవకాలం సమీాపిస్తున్నది. మీారేమో
వెళ్ళరు. స్వాములవారిని ఎరుగుదురుగా ?—

శివ : ఎరుగకేం ?— చంపుతారా ?— చంపనీ ! అంతకంటె
ఏంచేస్తాడు.

ఆచా : చంపిస్తారా - చంపి పాతిపెట్టిస్తారా - మరీ పొగరెక్కి—
వాగుతున్నావు.

పెద్ద : ఏంనాయమయ్యా !—మేం వార్లతో బిగించిన బేరీ

మీరు వాడుకోవచ్చా ?—మేంరాకూడదూ ?

శివ : మేం కొబ్బరికాయలు కొట్టుతామన్నాం అంతేగా !

ఆచా : కొబ్బరికాయలేమిటిరా కోతివెధవా ? వెళ్ళండి వెళ్ళండి
మీరు మా దేవుణ్ణి చూడకూడదు.

పర : వీధిలోకూడానా ?

ఆచా : ఆహా.

పతి : సమస్త చరాచర జంతుజాలములు చూచుటకు వీలున్న దేవునిమూర్తి వీధిలో సైతముచూడరాదా? మాకు అర్హతలేదా? మాదుర్దశయా? ఆహా! దేవుని చూచుటకు హక్కులేదా ? దేవుడందరికీ సమానుడుకాడా? స్వామీ! మీరెంతదూరం నిలువబడి చూడమంటే, అంత దూరంనుంచే చూస్తాం.

ఆచా : ఎంతమాత్రం వీలుకాదు. నేను కనుక ఇంకా నెమ్మదిగా మాట్లాడుచున్నాను. మా నరసింహాచారి అయితే రోగంవదలించే వాడే యీపాటికి.

పర : ఏమి ధర్మంస్వామీ !

పరునిదిట్టిన నోటిదురుసున కైదారు
మాడలోయేమొ జుల్మానగలదు

ఋణదాత ఋణముతీరుప కున్న నారు మా

సాలపాటో చెలసాలశిక్ష

మరతుపాకుల జూపి భయపెట్టిదో చెడి

రౌడీకి ద్వీపాంతరంబుగలదు

పగబెంచుకొని నిందు ప్రాణంబు బలితీయు

చెడుగునకై యురిశిక్షగలదు

కాని మాకర్మమిట్లుగా కాలిపోవ

తరతరమ్ముల శిక్షకంతంబులేదె

వాడలోనైన దేవుని జూడ, మాకు

అవధికల్పింపరెంత అన్యాయమయ్య !

ఆచా : దేవదర్శనం కావాలా చండాలుడా ? పోయేకాలం వచ్చింది. పనిపాటలు చేసుకోరాదూ ?

పర : నేను మిమ్ములను దూషించుటలేదు.

పెద్ద : ఆరెప్పుడూ అంతేరా. ఆలోశన ఏందంటూ పదండెహ.

శివ : దేవుని ఆలయంలో కట్టేస్తారటండీ.

పర : పోనీ యీ కొబ్బరికాయలు తీసుకుని స్వామివారికి కైంకర్యంచేసి యిప్పించండి. చాలును. అదేపదివేలు-ఏందాసూ !

శివ : ఇంకాఏమండీ ?

ఆచా : బంకనారపీచులాగు పట్టుకుంటే. వదలవేమిరా ? మీా తోబేరాలేమిటి ? వాటిని నీనెత్తినేసి కొట్టుకో.

శివ : ఏమండో ! యివాళ మాప్రాణాలు అర్పించినా సరే, కొబ్బరికాయలు కొట్టాలి దేవుణ్ణిచూడాలి అంతే. .

ఆచా : చూతువుగాని ఒరే! ఎవడురా ? మోద్దీన్ ! రాఘవయ్య యేడిరా ? రమ్మను - రండిరా ! ఒకొక్కడిని పాతిపెట్టండి - ముక్కముక్కలుగా నరికెయ్యండి.

(నలుగురు కర్రలతో ప్రవేశిస్తారు.)

(పరదేశి, శివదాసు గాక అందరూ పారిపోతారు.)

శివ : (చప్పట్లుకొట్టి) రండి - రండి ! పారిపోకండి - కర్రలు చూడగానే కాలికి బుద్ధిచెప్తారేమరా ? రండి - పరదేశీ ! నేను వారిని పిలుచుకువస్తా (వెళ్ళును.)

ఒకడు: వెళ్లు.

పర : నేనేం తప్పుచేయలేదు - పిదప తమదయ.

(కర్రలతో కలియబడి కొట్టుతారు.)

(పరదేశి రక్తము ప్రవింప నేలబడును.)

ఆచా : రోగం వదిలింది.

(పరదేశిని కర్రలతో ప్రక్కకు తోసివేతురు.)

( తెర . )

# పతితపావన

## తృతీయాంకము.

### ప్రథమ రంగం.



స్థలం : నారాయణ తీర్థుల మందిరం.

సమయం : రాత్రి తొమ్మిదిగంటలు

(తూగుటుయ్యాల. దానిపై పట్టుపరుపు. పైన కృష్ణాజినము దూరమున పీఠముపై శ్రీకృష్ణ విగ్రహము. ఎదరదీపము.)

**తీర్థులు :** (ఉయ్యాలపై ఊగుతూ)

"రఘుపతిరాఘవ రాజారాం పతితపావన సీతారాం"

**శిష్యుడు :** (గుర్రుకొట్టుచూ నిద్రపోతున్నాడు.)

**తీర్థులు :** (పరుపుపై ఉన్నగడియారం పైకితీసి) ఓ! తొమ్మిది కావచ్చినది. (శిష్యునిచూచి) ఇప్పుడు పడుకున్నాడు,

అప్పుడే గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. ఆరోగ్యానికి లక్షణం. శాస్త్రీ! శాస్త్రీ!!

శిష్యుడు : (అలాగే నిద్రపోతాడు)

తీర్థులు : (పెద్దగా) శాస్త్రీ! శాస్త్రీ!! యెంతమొద్దునిద్ర లే. భజనాలేదు భగవదారాధనలేదు. నిద్ర నిద్ర-ఎప్పుడూ నిద్రే.

శిష్యుడు : (ఊఅని మూలుగుచూ ఒడలు విరుచుకొనుచూ అటుపొర్లి పడుకొనును)

తీర్థులు : ఏమాభయం భక్తిలేనినిద్ర ? లే.

శిష్యుడు : (లేచి కనులు నులుముకొనుచు) వళ్లు తెలియని నిద్ర పట్టిందిస్వామీ. నిన్ననాటకానికి వెళ్ళేనేమో ఇవాళ పగలంతా మఠంచాకిరీతో సరిపోయిందేమో ప్రొద్దుగూకింది మొదలు నిద్ర తూలగొట్టేస్తున్నది.

తీర్థులు : భయం లేకపోతేసరి. లే. స్వామికి మంగళహారతి ఇచ్చి తీర్థం పుచ్చుకో.

శిష్యుడు : (దేవతార్చనవద్దకువెళ్ళి) ఆ! మరిచాను. (రహస్యంగా) మొన్న వచ్చిఉండిన సత్యవతీఆమె—

తీర్థులు : సత్యవతి ఎవరు ?

శిష్యుడు : (నవ్వుచూ) ఇంతలో మరచిపోయినారా ఆ సకేశ
వితంతువండి. ఆకోనసీమ ద్రావిడి. ఆహా - ఉపదేశాని
కంటూ ఇక్కడికివచ్చేది కాదూ మొన్న రాత్రేగదండీ.

తీర్థులు : ఆ! ఆ!! పేరునాకు తెలియదులే. ఏమిటన్న దేమిటి?

శిష్యులు : ఇవాళఎల్లాగన్నా వీలుచేసుకుని వస్తానన్నది. పద్మా
వతమ్మ అప్పుడే ఆవిడను అనుమానపు చూపులతో
చూస్తున్నది.

తీర్థులు : దాని అనుమానాల కేమిలే. మంగళహారతి యిచ్చి
నీవువెళ్ళి ఆవిడను వెంటబెట్టుకొనిరా. జాగ్రత. ఉత్త
రపు సందున ఆమొండిగోడ ఉన్నదే దానిమీాదనుంచి
తీసుకురా. ఎవరన్నాచూస్తే కొంప మునుగుతుంది.

శిష్యు : ఈవేళనాకు క్రొత్తగా హెచ్చరిక చేస్తున్నారా.
స్వాములవారు. ఇన్నాళ్ళయిందికదా ! యింతమంది
వచ్చారుకదా! ఎన్నడన్నా మాటతూలిందా? మన
కెంతభయమో, వాళ్ళకీ అంతభయమే!

తీర్థు : పద్మావతి నోటివట్టుపుది — ఈవిడ చాలా నెమ్మదీ
నేర్పూ.

శిష్యు : కొత్తమోజుఅంతా అల్లాగే వుంటుందిలెండి.

తీర్థు : మోజులంటావేమిటి? మంత్రాల కోసం వచ్చింది.
మంచి కట్టుబాటుల్లో పెరిగినమనిషి అవటంచేత

(త లు పు శ బ్దం)

ఆవిడేకాబోలు వెళ్ళి తలుపుతీయి-వద్దు. నీవు ఆలో
వను బయటికివెళ్ళి తిన్నెమీదకూర్చో-పద్మావతివస్తే
నీవు కాస్తదగ్గు—ఇక్కడనేను సర్దేస్తాను — నిద్రపోయేవు
సుమీ!

శిష్యు : నాకుచెప్పవలెనా స్వామీ? మీశిష్యత్వానికిలోటు
తెస్తానా?

(శిష్యుడు వెడలిపోవును—తీర్థులు పీఠమున గూర్చుండి)

"శ్రీకృష్ణ! చైతన్య! ప్రభునిత్యానందం! హారేరాం!
హారేకృష్ణ! రాధేగోవిందం" (ధ్యానము నటించును.)

సత్యవతి : (ప్రవేశించి, నమస్కరించి) మహాయోగ సమా
ధిలోనున్నారుకాబోలు స్వామివారు.

తీర్థు : (కళ్ళుతెరచి) నీవేనా?— ఎవరోఅనుకున్నాను— అధ్యా
త్మిక విషయములలో అభేధంలేకపోయినా, పారమార్థి
కంగా యీ భౌతిక సంబంధాలు ఆటంకాలు కాక
పోయినా, పామర లోకానికి అర్థంకాదు. కనుక
కాస్త చాటు మాటు వుండాలి.

సత్య : కాదామరి? ప్రకృతి అంతా నటనే కదండీ?

తీర్థు : నీవీవేళ వస్తావనుకోలేదు.

సత్య : తామేకదావద్దన్నది.— (ముసుగునుండి ఫలహారము యిచ్చి) స్వామివారి నైవేద్యానికి తెచ్చాను.

తీర్థు : నాకు రాత్రులుభోజనంలేదు — ఏదో పాలూపండ్లతో కాలక్షేపం చేస్తున్నాను — అదీకాకపోతే యింతకాఫీ యో, ఏదో...

సత్య : పోనీ, యివాళనాకోసం వ్రతభంగంచేసుకోండి.

స్వాము : ఇందులో వ్రతమేమిటి? భంగమేమిటి? ఈడపాధిని ఎల్లా అలవాటుచేస్తే, అల్లానడుస్తుంది. అయినా వ్రతభంగం ఎప్పుడో అయింది—ఇలాతే—

(తీర్థులు ఫలహారము చేయుచుండును.)

(లోపల శిష్యుడు దగ్గును - ఆమెను వెడలిపొమ్మని సంజ్ఞ చేయుచూ పెద్దగా) శాస్త్రీ!

లోపల : ఆఁ. దీని దుంపతెగ. దగ్గుపట్టుకుందండీ - ఏమీలేదు లెండి.

తీర్థు : అంతేకద! సన్యాసాశ్రమం ఒకటీ, అందులో మఠాధిపత్యం ఒకటీ, రెండేడిశాయి. స్వాములవారనిపించు

కోవడమేగాని అయినవాడికీ, కానివాడికీ హడిలి చావ వలసి వస్తున్నది.

సత్య : (తిరిగి వస్తుంది.)

తీర్థ : పరమార్థ తత్వమెరిగినవారైతే యింతభయపడ నక్కర లేదు— పామరులు.

సత్య : అర్ధరాత్రివేళ ఒంటిపాటుగా, మంత్రోపదేశం అని నే నిక్కడికి రావటం తప్పుకాదూ ? ఆడదాన్ని.

తీర్థ : తప్పనుకుంటే తప్పే. లేదనుకుంటే లేదు. 'మనయేవ మనుష్యాణాం, కారణం బంధమోక్షయోః' అంటే ఏమిటి? బంధానికి విముక్తికిన్నీ మనస్సే కారణం అన్న మాట. కనుక మనం తప్పు అనుకున్నా, ఒప్పు అను కున్నా, మనస్సుతోనేకాదా ? అందుకేచిత్త సంస్కా రం కావాలన్నారు. చిత్తసంస్కారం ఎప్పుడయితే పూర్ణమవుతుందో, చిదాభ్యాసత్వమైన సత్వం నిలు స్తుంది. ఆసత్తు, చిత్తు అంటే, ప్రకృతికీ, పురుషునకు అయ్యే అనుసంధాన అవస్థ. దానికే ఆనందమన్నారు- బ్రహ్మానంద మన్నారు - సచ్చిదానందం అన్నారు- సరే! ఆమంచినీరందుకో? (సత్యవతి యివ్వగాత్రాగును.)

సత్య : ఇప్పటికి వారంరోజులయింది - ఆమంత్రం ఉపదేశిస్తారా?
తీర్థ : ఇంకా అభ్యంతరమా ?

(ముసుగువేసి మంత్రం చెప్పుచుండగా పద్మావతి ప్రవేశించును)

పద్మా: (అలికిడి కనిపెట్టి ముసుగుతీయగా సత్యవతి కనిపించును. సత్యవతి తలవంచుకుని వెడలిపోవును.)

తీర్థ : 'రఘుపతి ! రాఘవ ! రాజారాం ! పతితపావన సీతారాం ! ' (లేచి కృష్ణవిగ్రహం దగ్గరవున్న పూలమాల తెచ్చి పద్మావతి తలకు అలంకరింపబోవును.)

పద్మా: (పూలమాల విసరి నేలకు కొట్టి) ఇప్పుడు జరిగిందంతా నేను చూడలేదా ?

తీర్థ : నీవెరుగనిదేమున్నది చూచేటందుకు ? తరణోపాయమునకు తారకమంత్ర ముపదేశం చేయుచుంటిని.

పద్మా: (కోపంతో) ఉభయుల తరణోపాయానికే కాదూ ?

తీర్థ : 'శ్రీరామరామరామేతి రమేరామే మనోరమే' అట్టి పవిత్ర మంత్రోపదేశంఅంటే నీకెంత హేళనగావుంది?

పద్మా : ముసుగులోని మంత్రోపదేశం (అనినవ్వును)

తీర్థ : మంత్రోపదేశం అంటే, మంచీ చెడ్డాలేకుండా మహా నవ్వులాటగా వున్నదే?

దానివయ్యారం మండా ? తక్కుచూ తారుచూపుండే తరుణులు తారకమంత్రంతో తంటాలుపడటం ఎక్కడన్నా వుందా ?

తీర్థు : నీవు లేవూ ?

పద్మా: నామాటకేంగాని - పాపం సత్యవతీ వ్రతానికి భంగం కలుగజేసినందులకు విచారిస్తున్నాను.

తీర్థు : అందులో యదార్థం గ్రహించక సర్వసంగ పరిత్యాగిని సహితం అనుమానిస్తున్నావే ?

పద్మా: ఈముసుగులో గ్రుద్దులాట ఎందుకు ?

తీర్థు : అదుగో ! మళ్ళీ అల్లాగే మాట్లాడుతుంది - సత్యవతి విషయంలో మాత్రం నేనేం హద్దుమీరలేదు. కావాలంటే, రామాయణం నెత్తిమీద పెట్టుకుని ప్రమాణం చేస్తాను.

పద్మా: 'రాధికాసాంత్వనం' "రసిక జనమనోభిరామం" పఠించే తమబోంట్లవద్ద రామాయణం ఎక్కడ ఉంటుంది ? భారతం ఎక్కడ ఉంటుంది ?

తీర్థు : అదుగో ! కిటికీలోనుంచి కనబడుతుందే, ఆ అరుంధతిపై

పద్మా: పతివ్రతాతిలకమగు అరుంధతి పేరు స్త్రీ వంచకుడవగు నీవు ఉచ్చరించరాదు.

తీర్థు: అయితే ఈవిశాల ప్రపంచంమీద ప్రమాణం.

ఆమె

పద్మా: ప్రపంచం అప్పుడే మీవంటి దుశ్శీలురవల్ల న మయినది - దానితో ప్రమాణమేమిటి ?

తీర్థు: నీయిష్టంఅయితే నమ్ము. లేకపోతే లేదు.

పద్మా: ఎంతమోసం! ఎంతమోసం? ఎంతమంది? లెక్క లేదు. నీపాలబడేవాళ్ళు - పైకి చెప్పేవన్నీ ధర్మ పన్నాలా? లోపల వనితా వ్యాసంగాలా? పైకి మంత్రాలు. లోపల తంత్రాలు.

తీర్థు: మరి స్వాములవారంటే సామాన్యమా ?

పద్మా: అబ్బే! ఆరు శాస్త్రాలు ఆమూలాగ్రంగా చదివిన అద్వైత పీఠాధిపతులు, ఆత్మబోధనలే కాసి అమాంగల్యాలు చేస్తారా ?

తీర్థు: ఆయింపే పరబ్రహ్మమన్నారు - అక్కగారు.

పద్మా: చెప్పేవన్నీ శ్రీరంగనీతులు. దూరేవి దొమ్మరి గుడిసెలు. నీవేం స్వామివి ? నీవేం మహాత్ముడివి ?

ఎవడు సత్యవ్రతాహీన నిష్ఠకు తన
సర్వస్వమర్పింప జాలువాడో?
దాన ధారాజలద్రవము లూరింపగా
చెమటోడ్చి ఎవడు కష్టించువాడో?

ధర్మ సంస్థాపనార్థము, నేత్రు**లీరులు**
పాలింపనెవడు దీక్షారతుండో?

సీ. ఎవడు సాంఘిక సేవకెన్ని నిరోధముల్
కలిగినన్ మనసు చీకాకు గొనడో?

అపరమయోగి, అతడె మహామహుండు;
పుక్కిటిపురాణముల జెప్పి మోసపుచ్చి
మతము పేరిట సొత్తెల్ల మాయజేసి
సౌఖ్యమాశించునీవెడ? స్వామివగుట.

**తీర్థ :** (తనలో) ఇవాళ వ్యాపారం కొంచెం దూకుడుగానే వుంది. ~~(ప్రకాశంగా) పద్మా — నా~~ ఉపన్యాసాలు నీకూ నీభక్తివిన్యాసాలు నాకూ, ఆరునెలలనుంచి అలవాటయినవి. పెద్దపెద్ద జమీందారులు సైతం 'స్వామీ! అని సాష్టాంగాలు పడుతూవుంటే నీకంటికి గడ్డిపరకలాగు కనిపిస్తున్నాను. ఈవేషభాషలే లేకపోతే నీవు అసలే మాట్లాడి వుండవు గదూ?

**పద్మా :** అక్కరేమిటిమరిన్నీ ?

**తీర్థ :** (పద్మావతిపై చేయివేసి) ఏం ఇవాళ ఆస్యం అయింది?

**పద్మా :** ఏంచెయ్యనూ? ఇంటెడుచాకిరి చేసుకొని రాత్రివేళ రావటం అంటే మాటలా? — మీకేం? చెప్తారు

పై పెచ్చు మాతమ్మేడు అదేమిటో అస్తఆమె
అక్కయ్యా అక్కయ్యా అని కేకలు.

తీర్థు : ఇంకెన్నాళ్లులే యీ తెరచాటు సంబంధం——

పద్మా : ఇంకా తెరచాటేమిటి, నా పిండాకూడు. నాకేం తోచటంలేదు. మందులకీ మాకులకీ లొంగేటట్లుగా లేదు. 'ఇదేంకర్మం? భగవంతుడా!' అని అస్తమానం ఆఘోరిస్తున్నాను.

తీర్థు : పరవాలేదులే! పండబోతున్నాంగా—

పద్మా : మీకేం? మొగవాళ్లు? ఈ బాధఅంతా మాకే ఈ లక్షణాలు దాగుతాయా? ఆడది అన్నది క్షణంలో ఆకట్టేస్తుందికదా? ఈ రట్టుబ్రదుకు ఎలా తప్పుతుంది? ఏనుయ్యో గొయ్యో చూచుకోవలసిందే—తెగించలేక ఏడుస్తున్నాను. (ఏడుస్తుంది.)

తీర్థు : ఎందుకు ఏడుస్తావు, ఈకాస్తభాగ్యానికి? కొంచెం ఓపికపట్టు దానికేదో ఏర్పాటుచెయ్యాలి— ఉన్నాయి కావూ సాధనాలు?- ఏదోయాత్రపేరుపెట్టి వూరువదిలితేనేగాని ఏంపని చెయ్యడానికి · వీలుపడదు. చూస్తూన్నా వెళ్లుదాం—

పద్మా : (కళ్ళనీళ్లు తుడుచుకుంటుంది.)

(నిద్రతో కళ్ళునూసికొని ప్రవేశించి) పద్మావతమ్మ లోపలికి వచ్చిపోతుందేమోనని కళ్లుకాయలు కాచేటట్లు చూస్తున్నాను, యింకా రాలేదు— స్వామీ ఆమెయిక రాదనుకుంటానండి — ఏమోనాకు నిద్రవస్తున్నది.

తీర్థ : ఊ—ఇదిగో! పద్మా—

శిష్యు : (తెల్లబోయి) ఏమిటీ — నీవువచ్చావూ? ఇల్లాగేవస్తా? (తనలో) అమ్మ దీనిదుంపతెగ !

పద్మా : ఏం ? ఎందుకు ?

శిష్యు : అబ్బె—అబ్బె—ఊరికే అడిగానులే !

పద్మా: ఏమోలే !

తీర్థులు: నీమోహంలే ! పద్మా - ఈవేళకునీవు వెళ్ళు. అబ్బీ! లాంతరు పట్టుకువెళ్ళవోయి.

పద్మా : అదొకటి ఎందుకువెంట ? నలుగురు నామొగం చూడ లేదనా ? ఎలాగో వెళ్లుతాను.

( తెర. )

—

తృతీయాంకము — ద్వితీయ రం

స్థలం: స్త్రీసేవాసదనం.

సమయం: ఉదయం ఎనిమిది గంటలు.

(ఇప్పుడు సుశీల సదనస్థాపకురాలు. పద్మావతి సదనంచేరి పది రోజులయింది. అక్కడ నూలువడకుట, అల్లిక, కుట్టుపని, శిశురక్షణ, వ్యాధిగ్రస్తులకు వైద్యసహాయమున్నూ, సదనంలోని స్త్రీలకు అందరికి ముఖ్యవిధులు. ఆంధ్ర, సంస్కృత భాషలు వారభిమానిస్తారు. రాజకీయానికి అక్కడ తావులేదు.

ఆరోజు శుక్రవారం. రాట్నలక్ష్మిపూజ. రాట్నమునకు పుష్పహారం వేసి, నిలువబడి ప్రభాతగీతంతో ప్రార్థిస్తున్నారు.

సుశీల: ఆటవికులయి తిరిగి మృగాజినములఁ
జుట్టి, యాకులసిగ్గు దాచుకొనునాడు
భరతవిశ్వైక భాగ్య దేవతగ నవత
రించి జీవసూత్రము ప్రసాదించినావు.

* * *

ప్రణవయుత సామగీతినీరవళికర్ణ
పేయముగనాని, నిను ఇలువేల్పుగాగ

ప.తి.త
న

మ నీభారతీయ కోట్లకుబ్రీతి

నిద్రతో కట్ట గుడ్డయు, దినదిండి కరవుదీర
లో నెరినోసంగుదు; వడుగు జన్నిదము పెండ్లి
ఔ కూతునకు బుస్తెదారముగూర్తు; నీప్ర
ర సాదమే లోక జీవన సాధనమ్మ
వేదకాలపు ముదిమి ముత్తైదువమ్మ
ప్రణతులివె రాట్నలక్ష్మి స్వరాజ్యలక్ష్మి!
దీవనలొసంగి మాయార్తి దీర్పుమమ్మ.

శాంతా! నిన్నరాత్రి ప్రసవించిన ఆమె సుఖంగా ఉన్నది కదా?

శాంత: తల్లి పిల్ల ఆరోగ్యంగా వున్నారు — పిల్లకిప్పుడే ఆముదంపెట్టి వచ్చినాను.

సుశీ: పద్మా! మొన్న మన సదనంచేరిన ఆవ్యాధిగ్రస్తురాలు రాత్రి సుఖంగా నిద్రపోయిందా?

పద్మా: రెండుగంటల దగ్గరనుంచీ, డొక్కపోటుతో తల్లడించిందమ్మా! ఏదో, కాపులుపెట్టి చేతనైన ఉపచారం చేశాను - ఇప్పుడిప్పుడే కాస్త అణగి పడుకుంది.

సుశీ: సోమమ్మఏదీ యివాళ? ప్రార్థనకుకూడా రాలేదు.

పద్మా: ఆకుష్టునిపికి తైలంరాచి స్నానం చేయిస్తుంది.

సుశీ : జాగ్రత్త! కన్నేప్రొద్దులు — ఒకరు అస్తమానం ఆమె తోనే వుండాలి.

పద్మా : అమ్మా! మొన్న కనకమ్మగారికి అమ్మాం, చూచారా! రుద్రాజుగడ అంచు చీర మోస్తరు చీరలు యిరవై కావాలని యినస్పెక్టరుగారి భార్యా కబురంపించింది — యీమాట ఎవరికీ చెప్పవద్దని హెచ్చరిక కూడా పంపింది.

సుశీల : పాపం! (చిరునవ్వుతో) పోనీలే! అభిమానం ప్రధానం.

పద్మా : మైసూరు వస్త్రప్రదర్శనసంఘంవారు వ్రాసిన జాబు సుశీలమ్మకు చూపినావటే శాంతా?

శాంత: నిన్నసాయంకాలం రామనాథంబాబుగారికి పంపించాను.

సుశీల : విశేషం ఏమిటి?

శాంత : మరేమీలేదు. మన వేముతీగెల పళ్ళెములు అక్కడి వారు చాలా మెచ్చుకున్నారట! యింకా వుంటే వందయినాసరే పంపమన్నారు.

రత్నా : ఏది? ఒకటి నాకు చూపండి.

సుశీల : (నొచ్చుకొనుచు) అన్నన్నా! - మరచిపోయినాను.

క్షమించండి. రత్నా బాయిగారు మాటలసందడిన - ఒసే శాంతా ! ఒకపళ్ళెం తీసుకురావే - ఏదోయిల్లా ప్రారంభించాం - ఇదంతా బాల్యావస్థలోవుంది - లక్షాధికారులైన రామోజీ మహాశయుల ధర్మపత్నుల్ను రావడం అంటే, మాసదనం పవిత్రమైనదన్నమాట.

రత్నా : లక్షలున్నా, రాణివాసాలుఅనుభవిస్తున్నా, ప్రజాసేవ చేసే భాగ్యం కలుగుట ఎంతవారికి ? — నిజంగా మీరు వరజీవులు.

సుశీల : ఏదో చిన్నదానను పెద్దజేయకండి - సంసార తాపత్రయాలలో. సమసిపోతున్నా, ప్రజాసేవ చేస్తే పారమార్థికం అనీ భగవత్సాన్నిధ్యాన్ని ప్రసాదిస్తుందనీ ప్రయత్నం ప్రారంభించి చేస్తున్నాము.

రత్నా : స్త్రీలకు — పరిశ్రమలవల్ల స్వయంవ్యక్తిత్వం కలుగజేయడం పారమార్థికం కాదామరి ? భగవంతుడూ మెచ్చుతాడు. నాకు చాలా సంతోషంగావుంది. నిజంగా యిక్కడఎంతో ప్రశాంతంగావుంది.

పద్మా : అమ్మా పరదేశిని మొన్న కోవెలదగ్గర కొట్టినారట— ఇందాక చెరువుదగ్గర అనుకుంటే విన్నాను.

సుశీల : రామరామ స్వజాతీయుని చావగొట్టుట! పరహింస పాతకమనయినా, తెలుసుకోరండి పండితులు.

రత్నా : ఎందుకల్లా జరిగిందో?

సుశీల : పరదేశి అనే పంచముడు కోవెలదగ్గర కొబ్బరికాయలు కొట్టుతానంటే, దెబ్బలు కొట్టిసారట—ఏమిఅన్యాయం!

రత్నా : అయినా మాలవాడికి గుడిదగ్గర కొబ్బరికాయలు ఎందుకండి?

సుశీల : వాడి తప్పేముందండీ అలా అనటానికి? - భగవంతుని ప్రార్థించుటకు బ్రాహ్మణుడేమిటి ? పంచముడేమిటి ? అందులో ఒకరి ఆటంకమేమిటి ? వాడు చదువుకున్న సంస్కారికూడాను.

రత్నా : మనపెద్దలందరూ కులాచారాలని ఎందుకు పెట్టారు? వాడు ఎంతటి జ్ఞానవంతుడై తేనేం? మాలవాడు మాలవాడే గాని బ్రహ్మర్షి అవుతాడా?

సుశీల : అమ్మా! చాలా పొరబడుతున్నారు—పెద్దలకు చెప్ప గలదానను కాను—'జ్ఞానవృద్ధైశ్శీల వృద్ధైర్వయో వృద్ధై శ్చ సజ్జనైః' వాడు జ్ఞానంచేత పెద్దవాడు. అలా అనుకుంటే, ఆధ్యాత్మిక జ్ఞానంవల్లపురాణ కాలంలో పతితు లెందరు పావనులు కాలేదు?

చండాలకాంతతో సంచరించిననేమి
తపసిగా వాల్మీకి దలపలేదె?
పల్లెపడుచు కన్న పట్టియైననునేమి
వ్యాసుని బ్రహ్మర్షి యనగలేదె?
వారకామినికి కుమారుడైతేనేమి
చెడెనె గౌరవము వసిష్ఠమునికి ?
పూర్వసువాసినీ పుత్రుండుగానేమి,
మునియంచు కౌండిన్యు పొగడలేదె?

అంతవరకేల? శౌనకుండనగ శునక
జన్ముడేకాద? జ్ఞానవిస్తారులైన
వారలకు జాతి హైన్యమ్ము వేరులేదు
ఇది సనాతన సిద్ధ సంపదయె మనకు.

రత్నా : అదివాస్తవమే–వారు అల్ప జన్ములైతేనేమి? వారల తపో నిష్ఠవల్లవారు పావనులే! వీళ్ళేమిటండీ? మద్య మాంసాలు విసర్జించలేని మాలవాళ్లు. మీరుచెప్పటం చూస్తే, అన్నిజాతులు సంకరం కావాలన్నమాట–

సుశీల : అదేచాలమంది అభిప్రాయం. పెద్దలు చెప్పినది, 'పంచములనే వేరుజాతి హిందూమతంలోలేదు –

శూద్రులకులేని అంటరానితనం పంచములకు ప్రసాదించవద్ద'ని

రత్నా : ఏదోయిది అనుశ్రుతంగా వస్తున్నది – అయినా వాళ్ళనంతగా బాధలుపెట్టటం తప్పే !

శాంత : (పళ్ళెం తెస్తుంది.)

రత్నా : (పుచ్చుకొని) మహాబాగా అల్లినారండీ - ఇది నేను తీసుకోనా ?

సుశీల : అంతకంటేనా.

రత్నా : (ఒక కాసు యిచ్చును.)

సుశీల : ప్రతిఫలం కోరలేదు.

రత్నా : ఏదో నాసంతోషం - పేదవానికి వినియోగించండి వేళ అయింది వస్తా.

సుశీల : చిత్తం.

(రత్నాబాయి వెడలిపోవును.)

(వీధిలో భిక్షుకుడు పాడుతున్నాడు.)

" జాము రేతిరి యేళ జడుపు గిడుపూ మాని
సెట్టు పుట్టా దాటి సేనులో నేనుంటె
మెల్లంగ వస్తాది నాయెంకి !
సల్లంగ వస్తాది నాయెంకి !

పచ్చన్ని సేలోక పండు వెన్నెల్లోన
నీలి సీరాగట్టి నీటు గొస్తావుంటె

వోయ్యోర మొలికించు నాయెంకీ
వోనలచ్చి మనిపించు నాయెంకీ !'

సుశీల : (నిశ్చేష్టురాలగును.)

శాంత : అమ్మా ! మేము తోటలో మొక్కలకు నీళ్ళు పోయమా?

సుశీల : (నిట్టూర్పుతో) ఊం.

(అందరూ వెళ్ళుతారు.)

ఆహా ! - ఏమి మధురగానం ! ప్రతిఅక్షరమూ రసో పేతంగా వుంది - ఇది సామగానం - వాతావరణమంతా దివ్యసౌరభ సమాకీర్ణమైంది — ప్రకృతి సౌందర్య మహిమ - ఏమిద్వైధీభావమిది - ఇది ఆనందమా లేక దుఃఖమా నాకు ?

(తిరిగి భిక్షుకుడు.)

"ఇల్లు యిల్లనియేవు ఇల్లు నాదనియేవు
నీయిల్లు యెక్కడే చిలుకా ॥ నీయిల్లు॥

*  *  *

మూణ్ణాళ్ళ బ్రతుకునకు మురిసేవు త్రుళ్ళేవు
ముందుగతి కానవే చిలుకా ॥ నీముందు ॥"

(ఒక కానీ ఇస్తుంది.)

భిక్షు : కప్పుకోవడానికి యింత పాతగుడ్డ యిప్పించరా అమ్మా !

సుశీల : (అక్కడనున్న ఒక వస్త్రం ఇస్తుంది.)

భిక్షు : పదికాలాలపాటు పదిమంది బిడ్డలతో శుభంగావుండు తల్లీ.

(భిక్షుకుడు వెళ్ళిపోతాడు.)

సుశీల: (ఒకనిముషం ఆగి) భిక్షుకుడా ! నీదీవెన అమోఘమైన దయ్యా - నాకర్మ పరిపాకం చెందలేదు కాని.

(కుర్చీలో కూలబడును.)

ఏమి నా నిర్భాగ్య జీవితం___

చనుబాలిచ్చి, పరుండబెట్టి, తనువాస్ఫాలింప జోజోలచే
కనుమూతన్ చిరునవ్వుకొన్న శిశువుల్ కౌగింటిలోదార్చి, మె
త్తనిముద్దుల్ గురిపించి హత్తుకొనుమాతల్; ఎంతపున్నెమ్ము సే
సినవారోగదె ! తొంటిజన్మ ఫలరాశీభూత సంకల్పులై.

గతజన్మంలో కళ్ళుకానక చేసిన కర్మమే ఈగతి కాల్చివేయుచున్నది - మనసా ! పదిలపడుము - పదిల

పడుము - నన్ను రాగబంధను చేయకుము - నాసాం
దర్యమడవి గాచిన వెన్నెల చందమయ్యె గదా - నా
గార్హస్థ్యం నిర్హేతుక సన్యాసమాయెకదా - నాశృంగా
రం బురదలో పోసిన పన్నీరయ్యెగదా - శృంగారమ్మా
అందు నాకు అంగారకయోగం - (కొంచెమాగి) ఛీ -
ఛీ - విషయలంపటుత్వము - ఐహిక సుఖలాలసత్వం -
అయ్యో - అయ్యో - ఏమి నాహృదయం యిట్లు దూకి
దూకి పడుచున్నది - ఏమి యీకలత ?

(ముఖము కప్పుకొని యేడుస్తుంది.)

రాజశేఖరం : (ప్రవేశించి) సుశీలా ! సుశీలా !

సుశీల: ఎవరు?

రాజ : నేను రాజశేఖరాన్ని.

సుశీల : (కనులు తుడుచుకుని) దయచేయండి.

రాజ : (కూర్చుంటాడు.)

సుశీల : (ఏడుస్తూ పాదాలకు నమస్కరిస్తుంది.)

రాజ : (పైకి లేవనెత్తి) ఎన్నిసారులో నిన్ను కలుసుకుందామని
ప్రయత్నం చేశాను - కాని వీలు దొరకలేదు - స్థితి నీ
వెరుగుదువుకదా ?

సుశీల : తమ ఆనతి లేకుండా సేవాసదనాన్ని స్థాపించి కాంతా జనంతో కాలక్షేపం చేస్తున్నాను - క్షమించండి.

రాజ : నిన్ను క్షమించటానికి నాకు అర్హతవుందా ? సుశీలా లేదు - కారణ మేమందువా ? ప్రజాసేవచేసి నీ జీవితం పవిత్రం చేసికొని, లోకానికి ఉదాహరణభూతం అవుతున్నావు. పాశ్చాత్య విద్యచే నేను పాషండత్వంలో పడినాను.

సుశీల : లోకానికి నేను లెక్కసేయను - మీ కొక్కరికి నేను చేసే పని ప్రీతికరమయ్యెనా, ధన్యురాలనే - హృదయం మీకు అర్పించితిని - శరీరం యీభూతసేవకు ముడుపు కట్టితిని.

రాజ : ఎరుగుదుచు - ఎరుగుదుచు - నీ సేవాభాగ్యమున పాల్గొను శుభముహూర్తం ఎప్పుడాయని కాలశక్తిని ఉపాసిస్తున్నాను.

సుశీల: తమ రాక ?

రాజ : పది రోజులయింది.

సుశీల : ఇన్నాళ్ళకయినా యీ దీనురాలిమీద దయకలుగుట నాభాగ్యమే.

రాజ : నిన్ను చూచిపోదామని వచ్చాను - మొదటనే చెప్పితిని కాదా వీలు దొరకలేదని.

సుశీల : మీ పరాఙ్ముఖత్వానికి నేను చేసిన నేరమేమి ? నేరం లేకుండగనే శిక్షయా ?

రాజ : సుశీలా - నేను నిర్దోషిని - కాశీలో చదువుకొనుచుంటి - నన్నమాటేగాని మనస్సెప్పుడూ యిక్కడే వుంటుంది. ఆమడలు దూరమైతే అంతఃకరణ దూరమౌతుందా సుశీలా ? గోడనున్న నీఫోటో చూచి చూచి కళ్లు కాయలుకాచిన రోజులు కావలసినన్ని వున్నవి.

సుశీల : ఇప్పుడు అమృతం వర్షించుచున్నది. అగ్నితప్తమైన హృదయం ఆనందాశ్రువులతో చల్లబడుతున్నది. నాథా ! మీరూ దోషులుకారు - నేనూ కాను - మరి భగవంతుడా దోషి ?

రాజ : కాదు - కాలం - అదీకాదు హిందూసంఘం - నేను ఏమిచేయను ? పంచమ ప్రచారంలో వెలివేసిన వాళ్ళ తో మనకి సంబంధాలు వుండకూడదని శంద్రీ, మహా రాజువంటి సంబంధం మరొకటి చేస్తామని మాఅమ్మ, నడిసముద్రంలో నావలాగున్నాను. ఏమీ పాలుబోవ డంలేదు.

సుశీల : తండ్రిమాటకు ఎదురాడి ధర్మం తారుమారు చెయ్య కండి - ఇంతకూ పూర్వజన్మంలో నేను చేసిన పాపం నన్ను ఈతీరుగా బాధపెట్టుతున్నది. అత్తమామలకు అసలే లేకపోయినా, ఎన్నటికైననూ యీ దీనురాలి యెడ, మీకు అయినా యింత దయ కలుగదా అని భగవంతుని ప్రార్థిస్తున్నాను. మీరూ చిన్నచూపు చూస్తే యీజీవితం యికే చాలించవలసిందే.

రాజ : తొందరపడకు - మానాయన సనాతన సమితికి సెక్రటరీ. మీనాయనేమో పంచమప్రచారమండలికి ప్రెసిడెంటు. శృతి కుదరటంలేదు.

(లోపల) శాంతా - చంటిబిడ్డ పోరుపెట్టి ఏడుస్తుందే.

(లోపల) సుశీలమ్మతో చెప్పు.

రాజ : వారు వస్తున్నట్లున్నారు.

సుశీల : ఏమి కర్మమో! భార్యాభర్తలం మాట్లాడుకోవడం కూడా తప్పు అయినదిగదా.

రాజ : ఒక్కమాట అడుగుతాను చెప్పు - కాశీకి ప్రయాణమై వస్తావా ?

సుశీల : ఎందుకా దొంగబ్రతుకు నాకు, మానాయనకు? ఆయన చేసేది దోషమైతేగదా ప్రాయశ్చిత్తం చేసుకోండని

నాప్రాణంపోతే నేనుఅనను. అదుగో వారువస్తున్నారు. దయమాత్రం ఉంచండి - **చాలును** - తిరిగి వెళ్ళేలోపల ఒకసారి కనిపిస్తే, సంతోషం.

రాజ: అదెందుకూ? కాశీకిపోవక క్రితమే గృహకల్లోలం కుదుటబడవలె. వస్తా. (వెళ్ళును.)

(స్త్రీలు వస్తారు.)

సుశీల: పది అయినట్లుంది - యింటికి వెళ్ళుదమా?

( తె ర . )

---

తృతీయాంకము — తృతీయ రంగము.

స్థలం: వీధి.

సమయం: సాయంకాలము.

( ప్రవేశం శివదాసు — పరదేశి )

శివ: (చేత నొక కాగితము చదువుకొనుచుండును.)

పరదేశి: (ప్రవేశించి) దాసూ - ఏమిటోయి యీ మధ్య మాయమయ్యావేం?

శివ: (పలుకడు చదువుకుంటూ తనలో)

పర : ఏకదీక్షగా చదివేదేమిటో నన్ను చూడనిచ్చేదవా ఒక సారి - (చేతితో లాగికొని శీర్షికచదివి) ఏం కాగిత మయ్యాయిదీ ?

శివ : ఇదా 'మరణానంతరం' అనే వ్యాసం. వ్రాసింది ఒక క్రైస్తవ మత ప్రచారకుడు.

పర : ఓయబ్బో ! ఏదీ ? తర్జుమా కూడ చేయబడినదే. చదువు.

శివ : (చదువును) "మనం నివసించునది యొక రాజ్యము. ఆముష్మిక మనునది మరియొక రాజ్యము. ఈ రెండు రాజ్యములకు మధ్యనొక పెద్ద అగాధం కలదు. దానిని దాటవలయునన్న ప్రతి మానవుడూ చీటీ పుచ్చుకొన వలెను. క్రమమైన చీటీ పుచ్చుకొననివారిని తోవలో అగాధములో పడవేయుదురు. ఈచీట్లలో రక్తవర్ణం ధూమవర్ణం - అన్ని వర్ణములు కలవు. కాని ప్రథమ తరగతి చీటి ప్రభువైన ఏసుక్రీస్తు రక్తమున తడిసియుం డుటచే అది రక్తవర్ణముకలది. ఆచీటి కలవారందరూ స్వర్గరాజ్యమునకు బోయెదరు. మిగతాచీట్లు మిగతా మతములవారివి."

పర : ఆ ప్రచారకుడు ఎవరో ఇంద్రజాలికునివలె నున్నాడు.
సరేకాని ఎక్కడా కనబడటంలేదు కారణం?

శివ : కనుపిస్తే మాత్రం ఏముంది? చీమ చిటుక్కుమంటే
శ్రీకృష్ణ భజనయేగాని కానీ కలిసివచ్చేదేముంది?

పర : అప్పుడే అంత వివశుడవైతివి. కాబోలయ్యా శ్రీకృష్ణ
ధ్యానమున.

శివ : ఇదిగో నన్ను వేధించకయ్యా - నీపాటలూ నీపద్యాలు
నాకు తలబట్టిపోయినవి.

పర : అదేం - అంత టక్కరితనం - దాసూ!

శివ : టక్కరితనమా - టక్కరితనమా - అది నాలో లేదు
నీ హిందూమతంలోనే వుంది. చాల్లేవయ్యా - నీ
ధర్మాలు నీవ్వూను. తిండికి మలమల మాడిపోతూంటే
పట్టుమని పావలా యిచ్చినవాడు లేడు.

పర : ఇది కోపమూకాదు పరిహాసమూ కాదు.

శివ : పరిహాసమా? ఔను పరిహాసమే - పంచములలో పుట్ట
టమే పరిహాసం - నేడు మనకన్నా పరిహాస పాత్రు
లెవరు? దినమెల్ల పనిచేసినా యజమానుని ఆగ్రహా
నికి గురి అవటం పరిహాసంకాదా? తోడిమానవులలో
హైన్యంగా - వన్యమృగాలకన్నా హేయంగా, పశు

పక్ష్యాదులకన్నా నీచంగా మనలను చూచి వారు ప్రసాదించే దూషణములు, వారుచూపే తిరస్కార ములు, వారు చేసే చేతలు, వీటికి పాత్రులమైయుంట పరిహాసంకాదా ?

పర : కాని సమయమునకై ...

శివ : ఇంకనూ సమయమా - నీకు సిగ్గుటలేదా? తల్లి చచ్చి పోతుంది మందుబాబూ 'పొమ్మావలకు' శవాన్ని లాగేస్తాం సహాయం స్వామీ 'నడుఅవతలకి' వీధిలో దేవుని వీక్షించుతామయ్యా, 'కొట్టుతాం' ఇదేనా సమాధానం యింకా ఏమైనావుందా - ఇంకను సమ యంలేదు. ఏమి లేదు - నీకూ నీ హిందూమతానికి ఒక్క నమస్కారం బాబూ.

పర : నామాటసరే - మనమతానికి కూడా ప్రణామం చేస్తు న్నావేమిటి?

శివ : మతం - మనమతం - అల్లాగే ఆనందించు - ఏదీ నా మతం అంటున్నావే - వీధిలోనికి వెళ్ళి పిడికెడు బియ్యం తీసుకురా నీమతం ఏమిటో తెలుస్తుంది. చయనులు గారికి ఎదురుగా రా నీమతం ఏమిటో తెలుస్తుంది. చెరువుదగ్గరకు వెళ్ళి చేరెడునీళ్లు పట్టుకురా నీమతం

అర్థమౌతుంది - కరణంగారు నిలబడితే నీవు నమ - నీ మతం ఏమిటో చెప్పుతుంది. నీవుకూడా నీమతంలో మనుష్యుడవే! చూపినావుగా నీమతం - నీమానవత్వం- నీ స్వామిగోవెల.

పర : మనలను ఉద్ధరించటానికి మహాత్ములెప్పుడో ఉద్భవించారు. ఆత్రపడిన లాభమేమి?

శివ : మనలను ఉద్ధరించడమే కల్ల - జీర్ణవస్త్రాలతో - చింపిరి తలతో-ఒక్కపూట గంజితో - మందుకయినా మాడ లేకుండా మలమల మాడిపోతున్న మనలను ఉద్ధరించడం, శుష్కవాదాలచేతా శూన్యహస్తాలచేతా గాక పంచమోద్ధారణ ఏదీ? ఇన్నాళ్ళనుంచి దిన బత్తెమునకయి రెండణాలు కూలియిచ్చే స్థితిమంతులు లేరా? గంజికి లేక కాళ్ళు ముడుచుకొని పడుకొన్నప్పుడు పట్టెడన్నము పెట్టు మతిమంతులు లేరా? లేరు - మన హిందూసంఘం గొడ్డుపోయింది. దానికి ధర్మ సంప్రదాయాలు లేవు - దయలేదు - ప్రేమలేదు - ఏమీలేదు. తొందరపడకు - కష్టాలకోర్చి కాలానికి కట్టుబడితే దైవము వారి హృదయాల ప్రవేశించి మనకొక మార్గము చూపుతాడు ఎప్పుడయినా.

శివ : దేవుడా లేడు - ఆతడూ మనయెడ పక్షపాతం వహించాడు. ' పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచ దుష్కృతాం ధర్మ సంస్థాపనార్థాయ ' ఏదీ - అవతరించలేదేం ? ఇంతకు నేను చెప్పేదేమంటే, రేపు ఉదయం క్రైస్తవమతం పుచ్చుకొన బోతున్నాను. రేపటినుంచి మన మతాలు వేరన్నమాట.

పర : మతం పుచ్చుకొనుటకు కారణం ?

శివ : కారణమా ? ఒకటికాదు వెయ్యి - ఎంత ప్రార్థించినా మన అభివృద్ధికి అవరోధం కలిగింది గనుక-ప్రత్యేకంగా కడుపు కక్కుఱితికి.

పర : దాసూ! నీవుక్రైస్తవమతం పుచ్చుకొందువు. అప్పుడు నీ కడుపు కక్కుఱితి తీరునా?

శివ : ఓ. వెంటనే - ఆదొరగారే ఏదో ఉద్యోగం చూపిస్తామన్నారు.

పర : ఉద్యోగంకోసం ఆశపడి మతాంతరుడ వయ్యెదవా ? పోనీ-మన పల్లెలోని వారందరూ మతమును స్వీకరించుచో, అందరికి అట్టి వేతన మొసంగుదురా వారు?

శివ : అహా - మనుష్యునిబట్టి.

పర: మళ్ళీ అదేమిటి? బ్రతుకుటకే దుర్లభమైన పతిత హిందూ జాతికి సహాయంచేయు సంకల్పమే నైనచో వ్యత్యాసం ఎందుకు చూపుట? దాసూ! నీకు ముందు మత సహనం అబ్బవలెను. ఇంకను యువకోత్సాహమే నిన్ను రేపెట్టుతున్నది.

శివ: ఎల్లాగయినా వాళ్ళలో చేరితే కొంత గౌరవమయినా కలుగుతుంది.

పర: కాని కొలదికాలంలో మనకూ కలుగుతుంది - నేను కూడా ఈసమస్యగూర్చి ఆలోచిస్తున్నాను. త్వరలో ఏదో నిశ్చయించుకొని ఒక విధానానికి వద్దాము. ఆత్రపడకు.

శివ: వాళ్ళ మతంలో కొన్ని ఉత్తమాదర్శాలు వున్నవోయి చూడగా.

పర: కావలెనంటె క్రైస్తవమతాన్ని గురించి నేచెప్పెదనుగా. జీసను బోధించింది "మతంకన్నా, మానవుల కందరకు ఆచరణ యోగ్యమైన ప్రేమతత్వం. ప్రేమలోకూడా, తన, పర, అనే భేదం కల్పించటంకంటె మించిన నాస్తికత్వం లేదు. అటువంటి సర్వమానవ ప్రేమ ఏర్పడిన ఏవ్యక్తి, నిర్మలాంతఃకరణంతో, ఈశ్వరాజ్ఞను తన

ప్రాణంతో సమానంగా పరిపాలిస్తాడో వాడే స్వర్గ రాజ్యానికి అర్హుడు" ఇదే జీసను సందేశ సారాంశము— దాని ఆచరణమే క్రైస్తవ మతం.

శివ : సర్వమానవప్రేమగదా వారితత్వం. అందుకనే అమోఘమైనదంటాను వారిమతం. దానివల్ల కష్టలుండవు.

పర : అలా అయితే—

ఒకవంక శాంతి కూరక యత్నములుసాగు
విప్లవమ్ములకాట విడుపులేదు
ఒకప్రక్కేవలో హింస పెకలింప జూతురు
పలలంపు డబ్లీల తలపుపోదు
ఒకఛాయ నాత్మరక్షో గ్ర యోగమునూపి
రచియింత్రు స్వార్థపరత్వగరిమ
ఒకవీధి సంఘసేవకమా ప్రచారముల్
వ్యక్తిపీడనములుప్పరము కెగయు

చిత్తవృత్తిని మొనసి శాసింపకుండ
ఎంత నుడివిన శాంతి లభింపదయ్య;
ఏల తీవరపడెదము? యోచించుకొనుము
దృఢమనస్కుడు సర్వత్ర తేజరిల్లు.

మానవకోటినంతా ఒక్క ప్రేమ సూత్రంతో బంధించి మనలో భగవంతుడు ఉన్నాడు అను ఆత్మజ్ఞానం అల వర్చుకుంటే, కక్షలు అంతరించిపోవును — అక్కడే కాదు ఇక్కడకూడా.

శివ : ఆత్మజ్ఞానం అలవర్చుకోవాలంటే ఆలయంలోకి వెళ్లాలి— అక్కడికి మనలను రానియ్యరు.

పర : దైవారాధనకు స్థలనిర్ణయమే లేనప్పుడు — ఆలయమేనని ఎందుకు మనకు ?

శివ : మనసు లగ్నంచేయడానికి ఆలయం అంటూ వుండాలా. క్రైస్తవులు అందరు చర్చికి వెళ్ళవచ్చు, మహామ్మ దీయు లందరూ మసీదుకు వెళ్ళవచ్చు, కాని హిందువు లందరూ దేవాలయంలోకి వెళ్ళకూడదు. మన గొప్ప తనం అదేగా ?

పర : అన్నిమతముల సారాంశము — 'దేవుడున్నాడు, అత డొక్కడే'అని. ఆతని సాన్నిధ్యంపొందటానికి సత్యము, అహింస, యివే సోపానాలు.

శివ : అన్నిమతములూ ఒక్కటయితే నీవు క్రైస్తవ మతంలో చేరటానికి అభ్యంతరం ఏముంది ?

పర : క్రీస్తును, మహమ్మదును దేవుని దూతలనియును, దేవుని ఆజ్ఞవలన లోకాన్ని ఉద్ధరించడానికి వచ్చిరనియు వారి నమ్మకము — కాని శ్రీకృష్ణుడు దేవునిప్రత్యక్షావ తారమనే నా నమ్మకము.

రామోజీ: (ప్రవేశించి) నారాయణరావుగారి యిల్లుఎటువైపు?

పర : మాకు తెలియదండి.

శివ : ఓహో ! అవతల వీధిలో నండి.

రామో : మీరెవరు ?

పర : మేము పంచములము. నా పేరు పరదేశి అంటారు.

రామో : పరదేశివి నీవేనా ! ఎక్కడన్నా పనిలో వున్నారా ?

శివ : లేదండి — వ్యవసాయపు పనులలోనికి రానివ్వటంలేదు మమ్ములను.

రామో : రేపు మాయిల్లుకు రండి చూద్దాం.

శివ : బాబూ !

ఎండకు వానకున్ కడుశ్రమించుచు, నా యను నట్టివారు లే
కుండగ, గుండెలో రగులుచుండెడి యాకటిమంట వేడిలో
యెండి శవమ్ములట్లు తపియించెడి మాపయి నీదయాసుధల్
నిండిన చూపులన్పరపి నెమ్మది గూర్చితి వార్తరక్షకా.

రామో : (వెళ్ళిపోతాడు.)

వీర : దాసూ!

తూలనాడితి విపుడెకాదోయి! మనదు
ఆర్య ధర్మాల పరమరహస్యములను
కష్టముల కోర్చిననెగాని కార్యఫలము
కలుగనేరదు సుమ్మి వే పలుకులేల?

(వెళ్ళుతారు యిద్దరూ.)

---

## తృతీయాంకం — చతుర్థరంగం.

స్థలం : బట్టలమిల్లులో ఒకవైపు.

సమయం : మధ్యాహ్నం రెండుగంటలకు.

(రామోజీ తన కార్యాలయంలో ఒక్కడూ కూర్చొని బల్లపైనున్న టెలిఫోనులో మాట్లాడుచున్నాడు.)

రామో : ఆ! ఎవరూ? కాంతిలాల్ — ఆ — ఇప్పుడే వాగన్ వచ్చింది — పట్టీచూచి — యాభై తానులేగా — పంపిస్తా ఊఁ — సాయంకాలం కలుసుకుందాం.

(బంగారమ్మ ఆ మిల్లులో ఒకకూలీ. వయస్సు పాతికేళ్ళకు కొంచెం తక్కువ. అవయవాలన్నీ తీర్చి దిద్దినట్లు

ఉన్నాయి. తగుమాత్రం అందగత్తె. కులానికితక్కువయినా గుణానికి పెద్దది. ఆముఖంలో దైన్యంగోచరిస్తున్నది.)

బంగా: (నిలబడి) తమతో మనవిచేసుకుందామని వచ్చాను. దణ్ణాలండి.

రామో: (నిశితంగా) ఏమిటది ?

బంగా: దొరగారూ ! కోపబడితే మేమెల్లా బతకగలం ?

రామో: ఉపోద్ఘాతం చాలించి ఏమిటో చెప్పు ?

బంగా: మా యింటివారు యింకాఆసుపత్రిలోనే వున్నారండి. కట్లు కట్టుతున్నారు. చెయ్యి తీసెయ్యనక్కరలేదట. నారింజరసం, పాలూ, ధారకంగా యిమ్మన్నారండి.

రామో: (కొంచెం ప్రసన్నతతో) ఊ !

బంగా: ఇప్పుడు ఆసుపత్రికెళ్లుదామని శలవడిగితే......

(చెప్పలేక ముఖం వంచుకుంటుంది.)

రామో: ఊఁ — అడిగితే ?

బంగా: గుమాస్తాగారు చివాట్లుపెట్టి, శలవూ లేదు, గిలవూ లేదు పొమ్మని కొట్టవచ్చారండి. అంతట నేను భయపడి......

రామో: (సమీపించి చెయ్యి పట్టుకొని ఆమెను బల్లమీద కూర్చోబెట్టుతాడు.)

కూర్చో — నావద్ద ఎందుకలా భయపడతావు ? సమా ళించుకో — శలవు కేంకావాలి ? నీవుఅడగటం, నేను కాదనటం కూడానా ?

బంగా : (బల్లకు దగ్గరగా నిలబడుతుంది.)

రామో: అక్కడ మీఆయనకు జబ్బుగావున్నా నీవు పనిఅంటే ప్రాణం యిస్తావన్నమాట. నీవంటివాళ్ళు నాకు పని కత్తెలుగా దొరికితే వేరే అడుగవలెనా ?

బంగా : పంచేస్తాం. రెక్కలు అమ్ముకున్న తరువాత మేము స్వతంత్రులం కాముగదా. పావలా అయినా వస్తే మావారికి ఏదో యింత పాలూ, నానురొట్టె కొను క్కొని వెళ్ళవచ్చునని......

రామో: ఫరవాలేదులే. డాక్టరుకూడా అన్నాడు, మీ ఆయ నకు వారంరోజులలో నెమ్మదిస్తుందని — భయపడకు.

బంగా : పంనిమ్మళిస్తుందో ? ఏమిటో ? కట్లుకట్టే ఆయనకు ఏమన్నాయిస్తే మంచిమందులేస్తారు. కూటికే గతిలేని అనాథపక్షులం. ఏమివ్వగలం. శరీరకష్టంఅంటే చెయ్య గలంగాని డబ్బు ఎక్కడివ్వగలం ?

రామో: (జేబులోనుంచి పదిరూపాయలనోటు తీసియిస్తాడు. ఆమె ముఖాన కొంచెం సంతృప్తి కనబడుతుంది.)
తీసుకో. నీమనస్సుకు నచ్చిన విధంగా ఖర్చుచేసుకో. శరీరకష్టం చెయ్యగలవే పిల్లా? చేస్తే ఈ పువ్వులు వెలవెల బోవ్వూ? ఈ మెత్తని చెక్కిళ్ళు కందిపోవ్వూ? ఈ అందమైన అవయవాలు ఆయాసపడవ్వూ?

(జేబురుమాలు తీసి ఆమెకు ఇస్తూ)

దీనితో ముఖం తుడుచుకో. నీవిక్కడ నిలబడటంవల్ల గది అంతా కళకళ లాడుతున్నదన్నమాట. బంగారమ్మ సింగారమని పలుకుతున్నాయి ఆ గోడమీద బొమ్మలు. ఆలస్యం అవుతున్నదని తొందరచేస్తున్నదాగడియారం. నీకేం తెలియటంలేదా? లేక తెలిసీ, తెలియనట్లు నటిస్తున్నావా?

బంగా: ఏమి పిచ్చి బాబుగారూ యిది?

రామో: ఇది పిచ్చి అను, ప్రేమ అను, ఉప్పెనవలె ఊగించేస్తున్నది నన్ను.

బంగా: తప్పు బాబుగారూ తప్పు. మీరు నాకు తండ్రివంటివారు. నేను మీ దాసీని.

రామో : తప్పదు పిల్లా తప్పదు. నీవు నా ప్రాణంవంటి దానవు. నేను నీ యజమానిని (మీద చెయ్యివేస్తాడు.)

బంగా : (కొంచెం తొలగి) దూరంగా వుండండీ ముందు. పెద్దలు. పెద్దమనిషి తరహా వుండాలి.

రామో: పెద్దయేమిటే పిచ్చిపిల్లా?

బంగా : కూటికి పేదరికముంటే గుణానికి వుందనుకొన్నారా యేమిటి? ఇందుకా ఈ రూపాయలు యిచ్చారు? ఏమో ననుకున్నాను!

రామో : నన్ను తప్పించుకొని వెళ్ళుదామనే? కదలు యిక్కడ నుంచి, తెలుస్తుంది నీ పస.

బంగా : నన్ను తాకు యిప్పుడు, నీసంగతి తెలుస్తుంది. నోటికి వచ్చినట్లుగా మాట్లాడుతావా? దుర్మార్గం చూస్తూ ఊరకుంటానికి లోకం గొడ్డుపోయిందనుకోకు.

రామో : (తలుపుగడియ వేయబోతాడు.)

బంగా : నన్ను పోనివ్వవా?

రామో : పోనిస్తాను, నా కోరిక తీరిన తరువాత.

బంగా : అల్లాగా! ఆడది, ఒక్కతే ఏంచేస్తుందని కాబోలు మీ ఊహ? (కుర్చీ చేతిలో తీసికొని)

ఏదీ ! ఇప్పుడు రా—అగుటకు ఆడదాన్నే—ఈ చేతుల్లో చేవ చావలేదింకా.

రామో: (మందహాసంతో) ఈ ధీమా నాకోరిక నెరవేర్చడంలో ఉంచుకో బాగుపడతావు. (రెప్పపాటులో ఆమె చేతి లోని కుర్చీ లాగివేసి ఆమెను కౌగలించుకోబోతాడు.)

బంగా : దాసూ ! పరదేశీ ! ! ఎవర్రా అక్కడ ! ! ! చస్తున్నాను ! రండి ! !

(పరదేశి ప్రవేశించి ఆమెను వదలిస్తాడు.)

పర : ఏం తండ్రీ ! నీకుకూడ యిట్టి కోరికయే కలిగిందా ? కంచె చేను మేస్తే కాపునకు బ్రతుకేది ?

రామో : నీవు తీర్పుదిద్ద నవసరంలేదు. నీ పని చూచుకో.

పర : అవును. ఎందుకు అవసరం ఉంటుంది ? మీరే ధనాఢ్యులు — మీరే తీర్పరులని మీ భావన కాబోలు! అది మీరనుకుంటే లాభం ఏముంది ? లోకం అనాలి. మానవులు హర్షించాలి.

రామో : స్వస్తి చాలిస్తావా ? చావగొట్టించాలా ?

పర : చావగొట్టించరూ ? మాగొంతులు కోయకపోతేమీ ఖజానాలకు కరువుపట్టదూ ? బానిసలమై — పరతంత్రులమై — అన్నాతురులమై — అధోగతిలో పడియు

న్నమాకు — మా అస్థికలబలమే — మా బాహువుల కష్టమే — మా ఉన్నతికి ఆధారభూతముకాని మీ దాస్యమువలన కాదని నేటికి మాకు తెలిసినది. ఎప్పటికైననూ మా జాతి నిర్వీర్యం కాకుండా నిల్చియుండాలంటే ఒక్క నీతియే మాకు ధృవతార. ఆ నీతి నియమాలు మీరు పాటించనప్పుడు రాబోయేది అశాంతితో కూడిన ఒక మహా సాంఘిక ప్రళయం అన్న మాట.

రామో: ఆరోజు మీరు తినుటకు కూడులేదంటే కూలీలగా జేర్చుకొన్నాను. ఆ విశ్వాసంకూడా లేదు నీకు.

పర: ఉంది. కనుకనే శారీరకష్టంచేసి సంపాదించుకొనటం మాధర్మం. కూటికి కూలిడబ్బులివ్వడం మీవిధి. మేము మీదాసులము. మీరు మాయజమానులు. ఇదేమన సంబంధ బాంధవ్యము.

రామో: అది నీవు పాటించుటలేదే? యజమాని ఆజ్ఞలను ధిక్కరించటం స్వామిభక్తికి లక్షణమా? (మిల్లులో పనిచేసేవారు, శివదాసువచ్చి నిలబడతారు.)

పర: మేముస్వామి ద్రోహులముకాము. ఎంతవరకు? మా నీతి నియమాలు పాటింపబడుచున్నంత వరకు — మాకు

సమాన ప్రతిపత్తి ఏర్పడుచున్నంతవరకు — మా ఆత్మ స్వాతంత్ర్యం అరికట్టబడనంతవరకు — అవి దాటిననాడు కాలం శాంతప్రదంగా ఉండదు. భూకంపముల అదురుళ్ళతో, అగ్నిపర్వతాల కారుచిచ్చులతో భీభత్సమై పోతుంది. దానిని శాంతిభూయిష్ఠంగా మీరు ఉంచాలంటే — స్వాధీనత — సామ్యము — సోదర భావము చూపించండి. అప్పుడే మానవకల్యాణం కలుగుతుంది. అప్పుడే జాతీయ సామరస్యం ఏర్పడుతుంది.

రామో : ఈధోరణి పర్యవసానం ఆలోచించుకొన్నావా ?

పర : పనిలో చేరునాడే తెలుసుకొన్నాను, మీ విలాసాలకు మేము ఆటవస్తువులమనీ —మీ లాభాలకు మేము కష్టించాలనీ, మీ దాస్యం మేము ఆజన్మాంతం చేయాలనీ — కాని మా స్త్రీలు మీకు ఉంపుడుకత్తెలుగా వుండాలని మాత్రం తెలుసుకోలేదు. మీప్రసంగం యిక చాలించండి. అమ్మాయీ ! పోదాం పద.

రామో : నీవు యిప్పటినుండి పనిలోకి రానక్కరలేదు. లోగడ నీకు యివ్వాలసింది నీకు జుల్మానా వేయబడ్డది. ఇక పోమ్ము.

పర : మాకింతకంటె అధోగతిరాదు. మీరు మమ్మ అందల మెక్కించబోరు. కష్టంచేయాలిగాని కడుపుకెంత కూడు దొరకదా? స్వామీ — సెలవు.

(బయలుదేరుతాడు.)

(అతనివెంట అందరు సాగిపోతారు.)

( తె ర )

---

# పతితపావన

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.



స్థలం: రామనాధంగారి యిల్లు.

సమయం: మధ్యాహ్నం ఒంటిగంటకు

(రామనాధం బల్లపై పుస్తకములు సర్దుతున్నాడు. రాజ్యలక్ష్మి ఉత్తరీయం పట్టుకొని ఎదురుగా నిలబడింది)

రాజ్య: అయిన మీ ప్రయాణమెప్పుడు?

రామ: (సర్దుచూ వినుపించుకోడు.)

రాజ్య: మిమ్మల్నే — ప్రయాణం ఎప్పుడని?

రామ: రేపురాత్రికి. కొన్ని కాగితాలు కనబడక వెతుకుతున్నాను.

రాజ్య : ఏం కాగితాలు ?

రామ : కాన్ఫరెన్సువారి కార్యక్రమపట్టిక — నీవేమన్నా తీశావా ఏమిటి ?

రాజ్య : కాన్ఫరెన్సు గడ్డలై నట్లేవుంది. నాకెందుకు ?

రామ : నీ జన్మ అంతా యింతేకదా ?

రాజ్య : సరిగాని తిరిగిరావడం ఎప్పుడు ?

రామ : (విసుగుతో) ఎందుకూ ? ఎప్పుడో ఒకప్పుడు వస్తారు.

రాజ్య : కోపంకూడా ఎందుకూ ?

రామ : ఇల్లు బయలుదేరటమే తరువాయి - ఎప్పుడొస్తారు, ఎక్కడికి వెళ్లుతున్నారు — అస్తమానం సోదిలాగు చస్తున్నాను, మరిన్నీ.

రాజ్య : ఎప్పుడొస్తారని అడుగకపోతే ఏం చేయమంటారు, చిల్లరబాకీవాళ్లు నిలవనియ్యకపోతుంటే ? మీరు ఉన్నప్పుడు అడుగరు. కాలు కదుపగానే నన్ను పీక్కుతింటారు. శర్మగారు డబ్బు యిచ్చారట ?

రామ : అప్పుడే రిపోర్టు వచ్చిందా ఏమిటి ?

రాజ్య : రిపోర్టులు రానక్కరలేదు. మీ చొక్కాజేబులే చెప్తాతవి. అయినా నాకెందుకులెండి. బ్రతికినన్నాళ్లూ యింత తిండి పడెయ్యండి చాలు. నగలా నాణ్యాలా ?

రామ : అన్నట్లు కట్టడపు దండవిడిపించాలనుకున్నాను. రెడ్డి గారు డబ్బు పంపిస్తారు. అది పెట్టి తెప్పించు.

రాజ్య : ఇంకా కట్టడపు దండాలేదు గోడగడ్డలూలేదు. అది అప్పుడే పోయింది. రెండువందలికి తాకట్టు పెట్టితే నూటపాతికకే యిస్తారా యేమిటి ?

రామ : మిగతాది నేను వచ్చి యిస్తాలే.

రాజ్య : మరి చిల్లరబాకీలకేం సమాధానం చెప్పను ?

రామ : ఏమాత్రం యివ్వాలేమిటి ?

రాజ్య : పాలమనిషికి పాతికరూపాయలు. కట్టెలవాళ్ళకి పది రూపాయలు. రేబాలవారికి రెండు రూపాయలు, యింకాచాలా వున్నవి. ఇందాక అమ్మాయిచేత వారి యించాను.

రామ : తీర్చుదాంలే క్రమంగా.

రాజ్య : వాళ్లు ఒక్క గడియ అయినా ఆగరు. సమాధానం చెప్పక మీరు సాగిపోతే, నేనుకూడా మీవెంట రావ లసినదే యిక.

రామ : రెడ్డిగారి వద్దనున్న పైకం రెండురోజులలో వస్తుంది. పోనీ ముందు చిల్లరబాకీలే తీర్చు — దండ తరువాత విడిపించుదాం.

రాజ్య : తరువాత తరువాతనే. కూనపరాజుగారికి అమ్మిన పొలం పంటతోనేటగా !

రామ : ఔను. అల్లాకాని వారు వప్పుకోమన్నారు.

రాజ్య : దండ అమ్మి చిల్లరబాకీలు తీర్చి మిగతాది తీసుకోండి. ఇంకా రహస్యపు బాకీలుంటే తీర్చుకుందురుగాని, లేక పోతే ఎప్పూరుకో రైలుచార్జీలకు అయినా ఉపయోగ పడుతుంది.

రామ : ఏదో ఒకటి నేను వచ్చి ఏర్పాటుచేస్తాలే.

రాజ్య : దురదృష్టదేవత నామొహాన తాండవమాడకపోతే, చింతపండు అడవంటి వస్తువులే — అన్నీ అమ్మేశారే ! కాసులు కట్టడపు పేరూ పోతే, యిక గాజులజతలేగా మిమ్ములను నన్ను రాద్ధాంత సిద్ధాంతాలలోనికి దించేవి!

రామ : ఎక్కడా తీరుబాటు కలుగుటలేదు, అన్ని వ్యవహా రాలు చక్కబరచుకోవడానికి.

రాజ్య : తీరుబాటు ఎల్లావుంటుంది ? విధవా వివాహాలలో మీరు ! పంచమోద్ధరణలో మీరు ! గ్రంథాలయ

ప్రదర్శనాలలో మీరు ! కాంతా స్వాతంత్ర్య ప్రచారంలో మీరు ! రాజకీయంలోనూ మీరే ! రైతు ప్రబోధాలలోను మీరే ! ఒక్కటా ? ప్రతివ్యవహారంలోనూ మీరుండాలసిందే !

**రామ :** ఇదంతా ప్రజాసేవకాదూ, నీకు తెలియక మాట్లాడు తావుకాని.

రాజ్య : ఎవరు చేయమన్నారు ? బెంగుళూరు పెంకుల్లాంటి పెళ్ళాం పెళ్ళివస్తువులమ్మి ప్రజాసేవ చేయమన్నారా ? ప్రతిసాలును పదివందలు వచ్చే పంటభూములమ్ముకుని పంచమ ప్రచారం చేయమన్నారా ? మామగారు వ్రాసియిచ్చిన పాటిస్థలాలు క్రియాలు చేస్తేనేగాని దేశసేవకు పాత్రుడుకాడన్నారా ? బంగారంవంటి భార్యను బాధపెట్టడమేనా మీ నిమ్నజాత్యుద్ధరణ ? ఈడుమీరిన పిల్లకూ, యిల్లాలికి సంపాదించి సంసారం సాకలేక పోవడమేనా మీ ఆదర్శం ? ప్రతిరైలూ ఎక్కి ప్రయాణం చేయడమేనా మీ పరిషత్తుల ప్రణాళిక ?

రామ : అదేం యివాళ ఒక్క పత్రిక అయినా రాలేదు ?

రాజ్య : ఎందుకూ ? వద్దని చెప్పేశాను.

రామ : ఓసి నీ అసాధ్యం కూల ! కారణం ?

రాజ్య : పాలు చందాలు ఆపితే సంసారం ఖర్చు సగం తగ్గుతుందని.

రామ : ఖర్చు ఎంతా వెధవపత్రికలకు ?

రాజ్య : అయ్యయ్యో — వార్తాపత్రికలకు కొంత — వితంతు పాణిగ్రహణాలకు కొంత — పానీయాలకు కొంత — ప్రయాణాలకు కొంత — మితవ్యయం ఎప్పుడేర్పడుతుంది మీకు ?

రామ : నిన్ను మహిళాసభకు అధ్యక్షత వహించమని ఆహ్వానిస్తారట ! అప్పుడిదే ఉపన్యాసం చెప్పు.

రాజ్య : నేనేం చెప్పనక్కరలేదు. ఎవరి హృదయాలకు వాళ్ళకు తెలియదూ. ఎవరి సంసారంలో యీ బాధలులేవు. కూటికీ గుడ్డకు దూరమైపోయి, సంసారం చతికిలపడి, వ్యర్థప్రసంగాలతో, ప్రజాసేవచే పాడయిన వాళ్ళెంత మందిలేరు? మనమూ అందరితో పాటే అవుతున్నాం.

రామ : ఇక చాలుగాని ఊరుకో. మరీ మితిమీరిపోతున్నావు.

రాజ్య : నేనంటే మీకు కోపంగాని — ఏంఖర్చు-ఏంఖర్చు-తలుచుకుంటే గుండె గుభేలు మంటున్నది.

రామ : ప్రజాసేవలో ధనికుడూ, దరిద్రుడు అన్న వ్యత్యాసం లేదు. అందరికీ ఒక్కటే ఆశయం. అది మానవసేవ.

రాజ్య : ఆస్తి సొంతంగా పోగొట్టుకోని, సంసారం సాకలేని ప్రతివాడూ ప్రజాసేవకుడే! ఇంట్లో ఇల్లాలికి యింత పిండాకూడు పెట్టలేని ప్రతి ఉపన్యాసకుడు ప్రచారకుడే! అటువంటివాళ్ళు చేరబట్టే మీ ప్రయత్నాలన్నీ మధ్య లోనే మాడిపోతున్నవి. నన్ను వాగించకండి. ఇంతకూ మీరు వెళ్ళేది ఏసభకు ?

రామ : కార్మిక మహాసభకు.

రాజ్య : ఎక్కడేమిటి ?

రామ : పూనాపట్టణంలో.

రాజ్య : అమ్మయ్యో — అంతదూరమే — పునహాకు యిక్కడ నుంచి మీరెందుకు ?

రామ : ప్రాతినిధ్యం వహించుటకు.

రాజ్య : ఇక ఎవరూ పోమన్నారా మీరు తప్ప ?

రామ : అందరూ నేనే పోవాలని తీర్మానించారు.

రాజ్య : యింకా పచ్చగా వున్నారని — రైలు చార్జీలు యిస్తుంటే పోనీ ఎవరైనా వెళ్ళి పట్నం అంతా చూడ గూడదూ ?

రామ : చార్జీలు యివ్వరులే — ప్రయాణ ఖర్చులకు వెనకాడే వాడు ప్రజాసేవ యెన్నాళ్ళు చేస్తాడు ?

రాజ్య : నామాటవిని మానెయ్యండి — మీ పాదాలు పట్టుకు
ప్రతిమాలుతాను.

రామ : నీవు వెడుదూ ప్రసంగం ఆపి !

రాజ్య : సంసారం బాధ్యత గలదానను గనుక చెప్పినాను.

సుశీల : (ప్రవేశించి) నాన్నా! మీకొరకు ఎవరో వచ్చారండీ!

రామ : ఎవరూ ?

అమీనా : (ప్రవేశించి దణ్ణంపెట్టి) అయ్యా నేనండి.

రామ : నీవా — కోర్టు అమీనావు కాదటోయి ?

అమీనా : చిత్తం.

రామ : మొన్న దశరాకు వీరాకు మామూలు యిచ్చానేమో ?

అమీనా : ఇచ్చారండి. కొంచం పనుండి.

రామ : ఏమిటి ? చౌదరిగారి డిక్రీ అమలు జరిపినారా యేమిటి
చెప్పూ ?

అమీనా : మరేనండి.

రాజ్య : డిక్రీ మొత్తం ఎంతేమిటి ?

అమీ : పన్నెండువందల వరకు వుంటుందండి.

రాజ్య : అమ్మయ్యో ! పన్నెండువందలే ! ! యిన్నాళ్ళనుంచీ
ఎనిమిదివందలనఘా బాకే?

సుశీల : (మెడలో గొలుసు తీసి) ఇది బజారుకు పట్టుకువెళ్ళి వారి బాకీ తీర్చండి నాన్నగారూ!

రామ : వద్దులే అమ్మా. (రాజ్యలక్ష్మితో) నీవు ఏడవకు — (అమీనాతో) రేపు మధ్యాహ్నంవరకూ ఆపు. చౌదరితో ఎల్లాగో ఫైసలుచేసుకుంటాను — లేకుంటే సరే కథాక్రమం సాగుతుంది.

అమీనా : తమ వద్దనుంచి డబ్బు రాదని కాదండి. ఈ సంఘ వ్యవహారాలలో ఆ శంకరరావుగారి ప్రోత్సాహం ఎక్కువయింది. చౌదరిగారూ విధిలేక ఒడబడినారు. అదేం కర్మం అండీ — ఆ శంకరరావుగారు సంబంధాలకోసం తిరుగుతున్నారు — మీ అమ్మాయిగారిని ఏలుకోరట!

రామ : దైవసంకల్పం ఎలావుంటే అలా జరుగుతుంది.

అమీ : సెలవండి (వెళ్ళుతాడు.)

రాజ్య : (సుశీలతో) లోపల పిల్లి జాడీలు పడవేసినట్లుంది. వెళ్ళి చూడు అమ్మాయి.

సుశీల : (లోపలికి వెళ్ళుతుంది.)

రాము : శంకరరావుకు యిదేం పోయేకాలం! అమ్మాయి బజార్లలో ఉపన్యాసాలు యిస్తుంది, యిల్లుపట్టి వుంటుందా అని అన్నాడట.

రాజ్య : అనరా ఆమాట — వయసుమీరిన వనిత వారితో వీరితో మాట్లాడితే ప్రపంచం హర్షిస్తుందా — లోకానికి జడియండి అంటే విన్నారా, నామాట ? సేవాసదన మేమిటి ? నా శార్ధ్రపు సదనం. ఖద్దరు గుడ్డలు నెత్తి నేసుకొని అమ్మడం ఏమిటి ? నలుగురు నా మొహాన్ని ఉమ్మేస్తున్నారు.

రామ : నోరు ముయ్యి ఇక.

రాజ్య : మీ పాదాలు పట్టుకు బ్రతిమాలుతాను. మీరు పునహా ప్రయాణం విరమించి మీ స్వంతపనులు చక్క పెట్టుకోండి. సంసారంకంటె కార్మిక సంస్కారం కామి తార్థం కాదు. రానని వాళ్ళకి వ్రాయండి. కాగితం కలం పట్టుకువస్తా. (లోనికి వెళ్ళుతుంది.)

రామ : ఆహా ! మతము ఎన్నిమాయల పన్నుచున్నది. మత వైషమ్యమున మర్యాదకూడ పాటింపబడుట లేదు కదా ! సంఘసంస్కారము నన్ను ఎట్టి అంధకారమున కూలద్రోయుచున్నది !

విడువగజాల నుద్యమము; పేదరికమ్ము నరించె; అంతుక
న్నడదెట్లునైతు ? ఈమనిషిపట్టు మరల్పగరాదు; నాదు పెం
పడగెను; లోకులందరికి నారశి పాలయిపోయె బిక్షం; నా
గడుసుదనమ్ముచేతను వికావికలయ్యెను జీవసూత్రముల్.

ఒకవంక ఋణదాతలు తొందర చేయుచున్నారు. వేరొకదెస సనాతనులు వెలియని వేధించుచున్నారు. ఎన్నికష్టములకైన ఓర్తునుగాని ఇల్లాలి గృహకల్లోలమున కేమని సమాధానమివ్వగలను? సంఘసంస్కారమునకై ఎంతడబ్బు వెచ్చించితిని ? ఎంత కాల మోపిక పట్టితిని? కాని ఇంత అధఃపతితమగునా నాజీవితము... కాదు. ఎన్నటికినికాదు. నేనెట్టి మర్మరణమొందినను, నాయాశయ మీడేరవలె. నేనెంత బాధపడినను ఈ సమస్య పరిష్కరింపబడవలెను. తప్పదు — పోనిమ్ము — యావదాస్తియు పోనిమ్ము — కులగౌరవము కూలిపోనిమ్ము — మరియాద మంట గలియనిమ్ము — మంచి సెబ్బరలు మానవపరిష్కృతములు కావు. భగవంతుడే సాక్షి.

రాజ్య : (కలము, కాగితము చేతపట్టుకొని వస్తుంది.)

రామ : నన్ను రవ్వపెట్టకుము—నా త్రోవకడ్డమురాకుము— నా ఆచరణమే ధర్మము — నా నియమమే నీతి. నాప్రచారమే పతిత జనోద్ధరణము — అవును — అంతియే.

రాజ్య : నా మాట పాటింపరా ?

రామ : ఎన్నడూ పాటింపను - హిందూ సంప్రదాయమున భార్య, భర్తయాజ్ఞను మీరరాదను ధర్మము గుర్తెరుంగుము - నాకు సుఖమున్న నీకును సుఖమే - నా బ్రతుకే నీకింత పసుపుకుంకుమ నొసంగునుగాని, నీ పల్లపుపాలములుగావు - నాకీర్తియే నీకు గౌరవమొసంగునుగాని, నీమితవ్యయముగాదు. నాఆశయాచరణమే నీకు ఆముష్మికము నిచ్చునుగాని, నీవిమర్శన గాదు. వలదు- విడనాడ నీ సమస్యా పరిష్కార ప్రయత్నము.

రాజ్య : మీ ప్రయత్నము వద్దనలేదే—

రాజకీయాల కాలంబంత గడపినన్
దమమాట కడుగ్గైన దాటలేదు
ఉన్నదంతయు వితంతూద్వాహములపాలు
చేసినన్ మరుమాట చెప్పలేదు
కడజాతివారి సంకరసేవ జేసినన్
తమపైని భక్తి సుంతయునుపోదు
ఇంటిపట్టున నుంటకే నోచుకొనకున్న
ఇదియేమియని యేవగింపలేదు
అన్నివిధముల కొంపపాడై, ఋణమ్ము
పెరిగి, పేదరికమ్ము పై విరుచుకొనిన

లేశమైనను తెలియగా లేకపోతి
రెట్లుగడచును సంసారమింక మనకు ?

( ఏడుస్తుంది. )

రాము : పైన భగవంతుడులేడూ? నీవుపోయి నీపని చూచుకో.
(బయటికి వెళ్లుతాడు)

రాజ్య : ఆహా - బ్రతుకు తెరువు లేదా! మాకష్టములు గట్టెక్కు మార్గము లేదా — ఏమి అన్యాయము! ఏమి ఘోరము!! ఎంత సాహసము!!! ఓ సంఘ సంస్కారులారా! మీ ప్రజాసేవయనెడి ప్రగల్భము లేమాయె ? మానవ కల్యాణమను మీమిథ్యావాదము లెందు జొచ్చె? సర్వసౌభ్రాతృత్వమను మీ సంప్ర దాయ మేమూల డాగె? ఇంట యిల్లాలిని బాధించి, బయట బాకీదార్లు వేధింప, సంసారమును నిస్సారము చేసి ఎన్నాళ్లు మీరు దేశసేవ చేయగలరు? గృహ చ్ఛిద్ర సమస్యను పరిష్కరింప నేరని మీ ఖండాంతర సమస్య లెందుకు ? — స్వకీయాభివృద్ధి చేసికొననేరని మీజాతీయాభిమాన మెందులకు? గృహస్థ ధర్మము నిర్వర్తింపజాలని మీ మతాశయ మెందుకు? ఎవరిని

రక్షింపను ? ఇంటగెల్చి రచ్చ గెలువుడు — అప్పుడే
మీరు జాతీయ వాదులు.

(లోపల సుశీల — 'అమ్మా', 'అమ్మా' అని పిలుస్తుంది.)

రాజ్య : ఆ ! వస్తున్నా. (కంటనీరు తుడుచుకొంటుంది.)

( తె ర )

---

చతుర్థాంకము — ద్వితీయ రంగం.

స్థలం : నారాయణతీర్థుల మందిరము.
**సమయం** : మధ్యాహ్నం 2 గంటలకు.

(స్వామి ఒంటరిగా భగవద్గీత పఠిస్తున్నాడు)

శిష్య : (ప్రవేశించి) స్వామీ ! చయనులుగారు, వారు ఏరండీ ? ఈవేళ కనబటంలేదు, కారణం ?

తీర్థులు : అక్కడ యజ్ఞం జరుగుతూంది కాదూ, ఆ గొడవలో వున్నారు.

శిష్య : గ్రామంలో కావలసినంత క్రతువు జరుగుతూంటే స్వామివారు సాంఖ్యయోగం పఠిస్తున్నారా ? ఐహిక ఆముష్మికాలు రెంటికిని సామరస్యం కలిగించడంలో స్వామివారు సిద్ధహస్తులన్నమాటే!

తీర్థులు : ఉండరా — పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణ సంకటం — గ్రామంలో కబుర్లేమిటోయి ? (లేచి అటుయిటు పచారు చేస్తూ.)

శిష్యు : ఏమున్నాయండి ? ఆరోజు వాడిని చావగొట్టిం చారు కదా — ప్రజలంతా "వాడు పరమపూజ్యుడు — బ్రాహ్మణులే పరమ పాపాత్ములు — కాకపోతే కర్రలతో కలియబడి కొడతారా" అని గడబిడగా చెప్పుకుంటున్నారండి.

తీర్థులు : నీకు తెలియదులే — చాణక్యుని రాజనీతి ఏమిటో తెలుసునా ? "శఠేశాఠ్యం సమాచరేత్" అన్నాడు— ఈధర్మ పరిపాలనకు సామదానభేధ దండోపాయాలు సమగ్రంగా ప్రయోజన కారులే.

శిష్యు : ఎట్లాగైనా రోజులు అంత బాగాలేనట్టు నాకు కనిపి స్తుంది స్వామీ — పద్మావతి, పద్మావతి అని ప్రాకు లాడారే కాని మన రహస్యాలన్నీ బట్టబయలు చేస్తున్న దప్పుడే — యింకా గోరుచుట్టుమీద రోకటిపోటన్నట్లు— ఆరాజశేఖరం, ఎరగరూ అనుశీల మొగుడు ఆఅబ్బాయి చదువుకున్నవాడేమో, నానా గడబిడాచేస్తూ తల్లి దండ్రులపై తిరగబడ్డాడట. మీది మొండిధైర్యంగాని

వూరంతా ఏకమైతే మనం మాత్రం ఏం చేస్తామండీ ?
స్వామీ ! నాకేమో భయంగావుంది — మన్ను తిన్న
పాములాగు మీరు మాట్లాడరు.

తీర్థులు : (ఆలోచనతో అటునిటు తిరుగుతాడు.)

శిష్యు : ఎవరో వస్తున్నట్లుంది ! మట్టెల చప్పుడు ! !

తీర్థులు : ఆ ! మరచాను, రామోజీభార్య రత్నాబాయిని
యీవేళ రమ్మన్నానులే.

శిష్యు : (ముక్కుమీద వేలువేసుకొని) రామోజీ భార్యనే!
మనకిది చరమదశే అన్నమాటే ! !

తీర్థులు : అబ్బీ ! నీవు అంతకంతకు తెలివితక్కువ పెద్దమ్మ
వైపోతున్నావు. నాజాగ్రత నాకు తెలియదూ ?
రామోజీ లాటివారిని లక్షలు చూచాను.

శిష్యు : కాని పరిస్థితులు ప్రస్తుతం అనుకూలంగా లేవు.

తీర్థులు : అభిప్రాయం అంతా నీకు తరువాత చెపుతానులే —
నీవు వెళ్లు.

శిష్యు : (వెళ్ళుతాడు.)

తీర్థులు : (పడకకుర్చీపైనున్న కృష్ణాజినము సర్దుకొనికూర్చుని
నిద్రపోతున్నట్లుగా కళ్ళుమూసుకొంటాడు)

రత్నాబాయి : (పళ్లెరములో పళ్లతో ప్రవేశించి) స్వామివారు నిద్రావస్థలో వున్నారు! (అని పళ్లెరము క్రిందబెట్టి, నేలపై కూర్చుండును.)

తీర్థ : (నిద్రలో) రఘుపతి రాఘవ రాజారాం.........

రత్నా : (తనలో) ఆహా! నిష్కళంకమైన భక్తులకు నిద్రలోకూడా, దైవనామ స్మరణచే తాదాత్మ్యం కలుగుతుంది కాబోలు !

తీర్థ : (కనులు తెరచి) — ఎవరు? ఆహా! రా - రమ్మ.

రత్నా : (లేచి స్వామికి నమస్కరిస్తుంది.)

తీర్థ : ఆ కుర్చీ యిటు లాగుకొనుము.

రత్నా : (కుర్చీలాగి నిలువబడును.)

తీర్థ : స్వాములవారి సాన్నిధ్యంలో పెద్ద చిన్నలులేవు. కూర్చో.

రత్నా : (కుర్చీ కొంచెము దూరముగ లాగుకొని కూర్చుంటుంది) స్వామివారి సన్నిధికి రావడంలో రవంత ఆలస్యమైనది. క్షమించండి.

తీర్థ : దానికేమి? ఏ పనియును త్వరపడి చేయరాదు.

రత్నా : నిద్రాభంగము చేసితిని కాబోలు !

తీర్థ : లేదు. శ్రీకృష్ణుని రాసక్రీడల నూహించుచున్నాను. నేడు శరీరమున అనారోగ్యంగావుంది.

రత్నా : స్వామివారి పాదము లొత్తనా శ్రమదీరునేమో?

(పాదము లొత్తుచున్నది.)

తీర్థు : దక్షిణదేశమున ఒక వింత అచారముకలదు. నేను పర్యాటనం చేసేటప్పుడు, దాన్ని అరికట్టాలని విశ్వప్రయత్నం చేశాను. కొనసాగింది కాదు.

రత్నా : చిత్తం.

తీర్థు : వినుటకు కష్టమూ, ఆచరించుటకు అయోగ్యమున్నూ— అయితేనేం మూఢాచారం.

రత్నా : సంప్రదాయమైన సనాతనధర్మాన్ని శిరసావహించ మనే కదా శాస్త్రజ్ఞు లనడం.

తీర్థు : అంటేనేం ? వనితల బ్రహ్మచర్యాన్ని వదలించుటకు బ్రాహ్మణ సారథ్యమెందుకు! — ఏహ్యంగా వుంది. చాలా ఏహ్యంగావుంది.

రత్నా : (తనలో) ఏమీ యీతని సంభాషణ ?

తీర్థు : కాని మొదట నేను మూఢాచారమనే అన్నాను. ఆలోచిస్తే సత్సంతాన సౌభాగ్యానికి యీ ఆచారం అమోఘమైనదని కృతనిశ్చయుడ నైనాను. నీ అభిప్రాయం ?

రత్నా : ఒక్కొక్క దేశానికి ఒక్కొక్క ఆచారం. కాదని కాదని మనం ఏమి శాసిస్తాము ?

తీర్థు : శాసించటం ఏముంది ? అశాజనకంగా వున్నప్పుడు ఆజ్ఞ గానే ఆచరించాలి. మరి సంతానప్రాప్తియన సులభ సాధ్యమా ?

రత్నా : కర్మ కర్మ — మానవమహిమయా ? భగవంతుడు ప్రసాదించాలి.

తీర్థు : అదేమన్నమాట ? కృషిలో లోపంచేసి, గోవిందా అని కొలిస్తే ఆయనమాత్రం ఏంచేస్తాడు ? ఇహాన్ని యీస డించి, కేవలం ఆధ్యాత్మికంలో అడగిపోయి, స్వర్గ లోకానికి వెళ్ళిన సౌబరిని ఒక్కసారిగా సాగనంపలేదా భూలోకానికి ? చతురాశ్రమాలు సాకల్యంగా నడపాలి. పున్నామనరకం పోవాలంటే, పుణ్యం పాపం ఎల్లా వున్నా, పురాణపురుషుల సాంగత్యం తప్పక లభించాలి. మీరేదో చిన్నపుచ్చుకున్నట్లున్నది.

రత్నా : తండ్రీ ! తమ మనోగత అభిప్రాయం తేటతెల్ల మయినది. స్త్రీలయెడ తామిట్టి పలుకులు పలుకుట ధర్మంకాదు.

తీర్థు : ధర్మంకాకపోయినా, యిందు అధర్మంలేదు.

రత్నా : కష్టమేమీలేదు. లోకంలో ఎంతమందిలేరు ? అది నా ఒక్క తెకే బ్రహ్మ వ్రాయలేదు.

తీర్థు : అయినా ప్రాప్తంకూడా వుండాలిలే!

రత్నా : (కళ్ళుతుడుచుకుని అటునిటు పరికిస్తుంది.)

తీర్థు : దిక్కులు చూచెదవెందులకు? ఇక్కడికెవరూ రారు. ఎవ్వరినీ రానీయవద్దని శిష్యుడి కాజ్ఞాపించితిని. ఇక దైవాజ్ఞయే తరువాయి.

రత్నా : తండ్రీ! నా దశ నీకీతీరున తిరులెత్తించెనా యేమి? నాకర్మము...

తీర్థు : కర్మ పరిపక్వమగును నేడు.

రత్నా : ఛీ మూర్ఖుడా!

పరువు ప్రతిష్ఠలేక పరభామలకై యిటుపొంచి, స్వామివన్
గరువముతోడ, నింతపలుగాకితనాలకు సాహసింతువే?
తరుణుల పాదధూళి తలదాల్పగనైనను లేవు నిందు నీ
గురుపథ మంత కాల్చుకొని కూలితి నారక పాపవహ్నిలో.

తీర్థు : నీవేమన్ననూ నాకు అమృతాన్నమే! ఆలసించి నాకు ప్రాణాంతము తెచ్చిపెట్టకుము.

రత్నా : నన్ను కోరిన నీకు ప్రాణాంతంకాక వేరేముండును? స్వామివగు నీకీ పరనారీ వాంఛ యేల? పాపీ!

తీర్థు : ఎందుకు నీజీవితం యిట్లు పాడుచేసుకొంటావు? సంతానప్రాప్తియన సామాన్యమనుకొంటివా యేమి?

రత్నా : సంతానప్రాప్తి కొరకు నమస్కారం — నన్నిట్లు బలాత్కరించిన పాపంకాదా ? నీ పాదములు పట్టుకుని ప్రతిమాలెదను — నన్ను తలంపకుము. నీకు ప్రాధేయ పడెదను — నన్ను కోరకుము.

తీర్థ : శాస్త్రచర్చ స్వాములది కాని స్త్రీలదికాదు.

రత్నా : స్త్రీలయెడ నీవు సంచరింపవలసిన విధమిట్టిదా ?

తీర్థ : "కలదుకదా సుధారసము కంజదళాక్షుల ముద్దుపల్కులన్ " — ఆస్వాదరస్యం నీవల్లనే సార్థక్యత వహించింది.

రత్నా : ఛీ — ఛీ — బుద్ధిలేక వాగకుము.

కట్టిన కావిగుడ్డ కపకారమొనర్చితి సుంత కామమున్
గట్టగలేక, మత్తుగొని, కన్నులకావరమెక్కి, నన్నుచే
పట్టదలంతువే పరమపాపి ! పరాంగనలన్న తల్లులన్
కట్టడినేరవో ? యెడదగ్రమ్మిన మోహము దోచనీయదో ?

తీర్థ : (కొంచెం కోపంతో) ఏమి ! అంత పెద్దగా అరచిన భయమా నాకు ? (లేచి నిలువబడును.)

రత్నా : (భయంతో) ఆ — ఆ — ఇంత నిర్భయమా ? ఇంత గుండె నిబ్బరమా ? పరకాంతను పొందుటకు ఎంత పరమోత్సాహము ? అయ్యో ! అయ్యో !! దిక్కులేదా ? పక్షివలె — ఈతనిచే పడవలసినదేనా ? నన్ను

రక్షించువారు లేరా? నా రాకకేది శిక్షయా? అయ్యో! అయ్యో!! నన్ను సమీపింపకుము. సమీపింపకుము. నా దరిరాకుము. నన్ను పాడుచేయకుము. నా ప్రాణములు తీయకుము. నీకు ప్రణామ మొనర్చెద. వలదు. రావలదు. అయ్యో. అయ్యో. ఎవరక్కడ? రారేమి? వీనిని చంపరేమి? (పెద్దగా కేకలువేయును.)

పర : (ప్రవేశించి నిశ్శబ్దముగా ముక్కున వ్రేలిడి నిలువబడును)

తీర్థ : వాడెవడు ? మాలవాడు స్వాములవారి మందిరములోకి సొంతం రావడమేనా? రంగాభొట్లుగారూ! శంకరశాస్త్రి గారూ! రండి. రండి. పరదేశిగాడు బ్రాహ్మణస్త్రీని బలాత్కరిస్తున్నాడు. పిలువండిరా రామోజీగారిని.

పర : స్వామీ! సావధానులుకండు - ఎందుకు ఆయాస పడెదరు ? రండి. అమ్మారండి. మీకేమీ భయం లేదు. మీయింటికి భద్రంగా తీసుకువెళ్ళుతాను.

(రత్నాబాయి, పరదేశి వెళ్ళుతారు.)

తీర్థ : (స్తబ్దుడై నిలువబడును.)

( తెర. )

---

చతుర్థాంకము - తృతీయ రంగం.

(వీధిలో రామనాథం)

రామ : ప్రజలారా ! పరదేశి ప్రాయోపవేశంబూని నేటికి అయిదురోజులు - హైందవహృదయ పరివర్తనమునకు, ఆత్మ పారిశుధ్యమునకు ఉపవాసదీక్ష వహించినాడు - నిష్కల్మష దేశభక్తుడు - దైవభక్తుడు. ఏలమీకింకను అజ్ఞానము ? రండి. రండి. అంటరానితనంచేత దేశాన్ని మంటగలిపి పరాధీనత ఎక్కువ జేయకండి. ఆహా!

సప్త జలనిధి వలయిత క్ష్మాతలమున
సేతు శీతాద్రులాపాద శీర్షములుగ
నేకవాహికగా ముప్పదేనుకోట్ల
కమ్రగళ కలకలరవాకలన, నార్య
ధార్మిక విశిష్టసరణి, స్వాతంత్ర్య గీతి
నాలపించు నీభరత విశ్వావతార
ఎలుగురాల్పడ విలపించు నేలచెపుడి ?

* * *

మతము లెన్నెని కలవు, సమాజములును
కులములును గలవెన్నేని ; కొమరు మిగుల
నన్నిటిని చల్లనగు బొజ్జయందిమిడ్చి

కాచి విశ్వజనీనతా కల్పకమన
వరలు నీధాత్రికీ కృశావస్థయేల ?

*　　*　　*

వ్యాస వాల్మీకి శుక వసిష్ఠాదిమాని
వరుల, జనకాదులంబోని బ్రహ్మవిదుల,
సత్యధర్మాభిరతి హరిశ్చంద్ర ముఖ్య
చక్రవర్తుల, షోడశక్ష్మాధిపతుల
గనిన ఈపుణ్య భూమికీ వనటయేల ?

*　　*　　*

కులగురుత్వము గుణముచే వెలయుగాని
గుణరహితమైన కులమెందు గణుతికనునె ?
వృత్తి గల్పించె వర్ణ విభేదములను ;
తరతరము లొక్క వృత్తియే జరుగ గలదె ?
మారదే వృత్తి ? దానితో మారవలదె
వర్ణనియతి? పుట్టుకతోన వచ్చునే కు
లమ్ము ? నిల్చునె కృతక కులమ్ములెందు ?

*　　*　　*

కులము ముసుగులుగప్పి శ్రేష్ఠులమటంచు
నాగురు నీదొంగ నాటక మెంతకాల
మీ కులముల కతముననే ఈయఖండ

భరతవర్షము పరియలు పరియలై, వి
రిసి వికావికలై, చీలి, ప్రీలి పాయ
పాయలై, నుగ్గు నుసియయి పాడుబడును.

* * *

బాపడని మాలడని శుష్కవాదభేద
ములను నగుబాటుపాలయి, బలముసఖ్య
మంతరింపగ, నపకీర్తి నందమూడు
బంతులను వ్రాసెనావిధి; పరమసుహృద
భావమూనుట యొండె, యేబాధపడిన
రూఢి స్వాతంత్ర్యతాధ్వరోహణోత్స
వమ్మొనర్చి, యాత్మాభిమానమ్ము నిలిపి,
భారతఖ్యాతి దుందుభిధ్వానములను
దెసలమ్రోయించి ముక్తిసాధింతురొండె
నిశ్చయింపుడు, తడసిన నిరయమొకటె
గతి; భరతజాతికుత్తమ గతులులేవు.

(మరొకవైపుకు వెళ్ళుతాడు.)

---

చతుర్థాంకము - చతుర్థరంగము.

స్థలం : శంకరరావుగారి యిల్లు.

సమయం : ఉదయం 8 గంటలకు.

రాజశేఖరం : (పుస్తకము చదువుకొనుచుండును.)

శంకరరావు : (ప్రవేశించి) ఏదో తేల్చేసి చెప్పు. ఉద్యోగమా సబ్ జడ్జి. ఇదో అదో అనేటప్పటికి జిల్లాజడ్జికూడ అవుతాడు. కావలసినంత ఆస్తి. ఒక్కతేపిల్ల. ఈ యేడు గడచిందంటే నిముషంలో జిల్లామునసబు ఉద్యోగం చెప్పిస్తాడు. హైకోర్టులో మంచిపలుకుబడి గలవాడు. మన అదృష్టంకొద్దీ తలవని తలంపుగా సంఘటించింది. ఎదిగినపిల్ల. చదువుకున్నది. చక్కని చుక్క - అన్నివిధాలా అనుకూలంగా ఉంది. నీ జాతకంలో రెండోపెళ్ళి యోగంకూడా వుందట. తరువాత నీయిష్టం.

రాజ : (తలయూచి ఊరకుండును)

శంక : పలుక వేమిరా ?

రాజ : ఏంపలుకను నాన్నగారు? పెద్దవారు మీరే యిల్లాఅంటే నేనేం చెప్పేది ? సర్వవ్యవహారాలు పరిష్కారంచేసే ఉత్తమస్థానంలో వుండి, భార్య నాకువుండగా, మరొక

పిల్లను ఎలా అంటగట్టుతామంటున్నారో నాకు బోధ పడటంలేదు. దీన్ని అడవిపాలై పొమ్మనా? మీరు ఎలాచేస్తున్నారోగాని బుద్ధిశాలులు మాత్రం హర్షించే విషయంలేదు. నాకంతకంతకు దుస్సహామగుచున్నది. నా హృదయాన్ని వ్రణమండలం చేస్తున్నారు. ఎన్ని విధాల చూచినా నా మనస్సుకు నచ్చిన యిల్లాలు ఆసుశీలే! మీఆజ్ఞ ఉల్లంఘించలేక కట్టుబడి వున్నానంటే నమ్మండి.

(లోపల) శంకరరావు పంతులుగారూ—

శంక : ఎవరూ? (తొంగిచూచి) రామోజీగారా! రండి.

రామో : (ప్రవేశించి) తండ్రికొడుకులు మాట్లాడుకుంటుంటే అడ్డంవచ్చాను.

శంక : మరేం క్రొత్తలేదండి - మీకుతెలియని రహస్యాలు ఏమున్నవి? అదే మొన్న మీకు చెప్పినానుకాదూ - ఎంతచెప్పినా వీడు వినడంలేదండి.

రామో : ఎల్లా వప్పుకుంటారులెండి. ఉండేమాట అనటానికేం గాని, ఎన్నేళ్లు తపస్సుచేసినా సుశీలమ్మవంటి పవిత్ర మైన యిల్లాలు మీయింటికి కోడలుగా దొరకదు.

శంక : మీరూ అదే అభిప్రాయంలో వున్నారూ. ఆపిల్లను మాయింటికి తెచ్చినామంటే కులగోత్రాల ఆశ వదలుకోవలసిందే! స్వాములవారు మమ్మలను ఏమైనా బ్రతుక నిస్తారా?

రామో : స్వాములవారి సంగతి తెల్లవారిందిలెండి. ఇంకను స్వాములవారేమిటి? వాడికృత్యం ఒక్కొక్కటి వింటుంటే గుండెలో రంపపు కోతలాగున్నది. ఏమి మాయ నాటకం ఆడినాడండీ! సాక్షాత్తూ శంకరావతార మనుకున్నాం!! ఆపద్మావతిగారి గతి ఎల్లా అయిందో చూచారా?

శంక : (ఆశ్చర్యమున) ఆ! ఆ!!

రామో : ఏమిటి ఆలా తెల్లబోతున్నారు? మనలనందరిని తోలుబొమ్మలవలె ఆడించినాడండీ. పుణ్యాత్ముడగు రామనాథాన్ని నానా చికాకు పెట్టించాడే. చివరికి చౌదరమ్మకుచెప్పి వారంటు పెట్టించాడు. రామనాథం గారు కోర్టులో నిలబడి చెప్పిన మాటలు చెవులారా విన్నాను. ఏమి సత్యాత్ముడండీ - రామనాథంగారి మాటలకు కోర్టువారంతా - ఆయనను దేవుడిలాగు చూచారు. చౌదరమ్మ చప్పున రామనాథంగారి చేతుల

బుచ్చుకుని క్షమార్పణము చెప్పుకొని సగం బొక్కి తీసివేసే పద్ధతిని రాజీ చెప్పుతున్నాడు.

శంక : ఆ ! ఆ ! !

రామో : వీడి పన్నాగం తగులబడ. స్వామీ - అంటూ మనలోమనకు వైషమ్యాలు పుట్టించాడు-ఆలుమొగలికి ఎడబాటు కలుగజేశాడు - గోవిందనామ సంకీర్తనంతో కొబ్బరకాయలు కొట్టుకొనుటకు కోవెల ముఖద్వారం దగ్గరకి వస్తూవున్న పరదేశిని కొట్టించాడు. ఒకటి చేసి ఒకటి మానాడా ? పద్మావతీ ప్రసవంతో - మాయింటి అవాచ్యంతో వాడి పాపం భళ్ళున బ్రద్దలయింది.

శంక : ఆరిదుర్మార్గుడా !

రామో : బయటికి చెప్పలేకున్నాను. ఊరూ నాడూ ఏకమైంది. మఠంలో నగానట్రాజవులుకొని రాత్రికి రాత్రి పారి పోయాడు - యీలాటి కపట సన్యాసులను నమ్మి ప్రతివారితోనూ పగ తెచ్చుకున్నాం.

శంక : రామోజీగారూ ! నాకేమో ప్రపంచంఅంతా తిరుగు చున్నట్లుంది. ఆయన్నిగూర్చి అప్పుడప్పుడు కొన్ని మాటలు నాచెవిని పడుతూవుండేవి. కానివాళ్లు కల్పించేవి అనుకునేవాడిని.

రామో : వీటిఅన్నిటికి ప్రాయశ్చిత్తం అవసరం అంటారా లేదా ? మీకోడలు మీయిల్లు ప్రవేశించాలి. రామనాథంగారూ మీరు ఒకటికావాలి.

శంక : నేను ఒకప్పుడు అడ్డుపెట్టితినా, లోకానికి విరుద్ధంగా నడవటం వ్యగ్రతగా వుంటుందనీ బ్రాహ్మణత్వానికి హానికరమనీ అన్నానుగాని.

రామో: నిజమే - మనం యీరోజువరకు చేసిన పనులన్నీ అటువంటివే (లోపలజూచి) ఓరే సూరాయ - నేనిక్కడ వున్నాననీ రామనాథంగారిని, సుశీలమ్మతో కూడా వెంటనే రమ్మన్నాననీ చెప్పి వెంటపెట్టుకురా.

(లోపల) చిత్తం.

(లోపల) వారు దారిలో కనబడినారండి - ఇదిగోవచ్చారు.

(రామనాథం సుశీలతో ప్రవేశం)

రామ : (చిరునవ్వుతో) నమస్తే రామోజీగారికి, బావగారికి నమస్కారాలు.

శంక : (సుశీలతో) లోపలికి వెళ్లు అమ్మా.

సుశీల : (భర్తకూ మామగారికి నమస్కరించి లోపలికివెళ్లుతుంది.)

శంక : (తల వంచుకొంటాడు.)

రామో : మీకు నూరేళ్ళాయుష్యం - మీమాట అనుకుంటు న్నాం యిప్పుడు అంతలో వచ్చారు.

రామ : చెప్పితిని కాదు - ఇవాళకు పరదేశి ఉపవాసంపట్టి ఆరురోజు లయింది. అనుకున్నట్లు వారం రోజులు గడవంది తనదీక్ష మానసని ఎవరుచెప్పినా వినటంలేదు. నేనూచెప్పినాను. వేసవి చనిపోవునేమోనని భయంతో మరొక్కమారు చెప్పుదామని వెళ్ళుతున్నాను.

శంక : బావా ! నీవిషయంలో నేను చాలా అపచారంచేశాను, సిగ్గుబరువై నీముఖం చూడలేక తలవంచుకున్నాను. మతమనే కారుపొగక్రమ్మి నిర్మలమైన చూపు నిరోధించింది. ఆచారపిశాచం ఆవహించి మనస్సు, పాడగుట వల్ల కుతంత్రాలనూ కుత్సితమార్గాలను వెదకింది. క్షమించు. కొడుకు కోడలు వినోదిస్తుంటే చూచి ముచ్చటపడలేక పొయ్యాను అనుకున్నావా ? అదే మిటో పెనుభూతం ఆవేశించింది.

రామ : బావగారు యింతగా క్షమార్పణ చెప్పనక్కరలేదు. ఒక్కొక్కప్పుడు యిలావస్తుంది. గ్రహపాటును ఆకట్ట లేము.

రామో : రామనాథంగారూ ! జరిగిందేమో జరిగింది. మా కేమిటి ప్రాయశ్చిత్తం ?

రామ మీ కేగాదు నాకుకూడా - పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తం. పదండి. ముందు పరదేశిప్రాణాలు రక్షించడం ప్రథమ కర్తవ్యం.

రామో : సత్యమే. లేవండి. శంకరరావు పంతులుగారూ ! దయచేయండి.

శంక : మీ రేమిటి ? నేనేమిటి ? మీరు వెళ్ళితే నేను వచ్చినట్లే కదా !

రామ : బావగారూ బహుచతురులు.

రామో : అట్లుకాదు. చెప్పేదనుగా బయలుదేరండి. ఈ అర్థం లేని సనాతనానికి హస్తోదకాలు యిప్పించటంలో ఆచార్యపీఠం మీ రే అధిష్ఠించాలి.

రామ : ఆర్యధర్మాన్ని పునరుద్ధరించటానికి అంకురార్పణ మహోత్సవం అనండి.

శంక : నా కాక్షేపణ లేదు.

రామో : అబ్బాయిగారు రావటానికి ఉత్సాహపడుతున్నారు. రండి - సుశీలమ్మగారేదీ - రమ్మనండి.

(అందరు బయలుదేరుతారు.)

---

# పతితపావన

## పంచమాంకము.

### ఒకతేరంగము.



స్థలం: బజారు - సమయం: ఉదయం గం 10 లకు.

(పరదేశి మట్టిపాత్రముతో ప్రవేశం.)

పర: ఓహో! సృష్టిలో దీనులకాశ్రయమే లేదా? సకల విశ్వంభరా భరణుడు స్థాణువై పోయెనా?

అచట లేవనికదా అలిగి దుర్వాసుండు
అంబరీషునిపైకి అస్త్రమనిపె
అచటలేవనికదా అధికారమునుజూపె
రారాజుకాంత వస్త్రంబులొలువ
అచటలేవనికదా అదలించి స్తంభమ్ము
నరచేతజరచె దైత్యాధినేత

అచటలేవనికదా ఆక్రోన్నమకరమ్ము
భద్రేభమును భంగపరచెనాడు
అందుగలవాడ విందులేవనగనోనె
ఏలరావోయి ? నీవు నాపాలికింక
అంత్యజుడనౌట చుల్కనయైతినేమొ !
ఏమిసేతును మావిధి యిట్లువ్రాసె.

ఆశ్రమవాసుల ఆకలిదీర్ప నొక్కకబళమైననూ లభింప లేదుగదా ! స్వకీయపరకీయబుద్ధి నశించిననేగాని మా నవ కల్యాణమేర్పడదు. ఈ శిలారూపమైన సమస్య నెప్పుడు పరిష్కరింతువు తండ్రీ.! మా శివదాసు స్నేహపాత్రుడు. నాతోపాటీతనిగూడ నాలుగువీధుల త్రిప్పుచుంటిని. నావెంట నడువనేరడు - నన్ను విడిచి ఆశ్రమంబున కూర్చుండనేరడు. (పెద్దగా) గోవిందా - గోవిందా.

(ఒక బ్రాహ్మణుడు అన్నపుపళ్ళెరముతో ప్రవేశించి)

బ్రాహ్మ : ఓరి చండాలుడా ! నీవటరా - గోవిందా అంటే ఎవరో మధూకరానికి వచ్చిన బ్రాహ్మణ బ్రహ్మచారి అనుకున్నాను.

పర : స్వామీ ! నమస్కారము.

బ్రాహ్మ : ఛీ! పో అపారిచ్యుడా - వెధవ మాటలాడుతావు.
విస్తరిముందర కూర్చోబోతూ, విప్రబాలుడు వచ్చాడేమో మధూకరం వేద్దామని బయటికొచ్చాను. వళ్ళమంతా మైలబడింది.

పర : స్వామీ! జాతిచేత చండాలుడనుగాని కర్మకు చండాలత్వమేమి? అదిగాక యింధు బలవంతములేదు. తమ కిష్టమున్న ఒక్కకబళము దయచేయుడు.

బ్రాహ్మ : మాలవాడికి పరబ్రహ్మ తత్వమేమిటిరా - ఎప్పుడన్నా యీవీధివంపు వచ్చారా?

పర : బాబూ క్షమించండి. కోపపడకండి.

బ్రాహ్మ : ఇంకా క్షమించడమేమిటిరా, నిక్షేపంలాంటి మబడిట్ట మైలబడితేను. నీజీవానికి పడి మళ్ళీస్నానం చెయ్యాలి.

పర : పోనీ ఎల్లాగు తెచ్చినారుకదా - అది క్రిందపెట్టండి - ఆ దుమ్ముదులుపుతాను - ఒక్కొక్క మెతుకు మా ఆశ్రమంలో ఒక్కొక్కరికి ఒకపూటతిండి.

బ్రాహ్మ : నన్ను యింతవేధించిన నీకు ధర్మంకూడానా - నీకు పెట్టేకంటే నిత్యం వాకిట్లో మొరిగే నల్లకుక్కకు పెట్టితే మంచిది. (అన్నం పరదేశి మొగమున విసరివెళ్లును.)

పర : ఆహా ! ఏమిధర్మం ? అది అగ్రజాతులకే గాక అన్య జాతులకు పనికిరాదా ! అంటరానితనమా ! వస్తువును చూచినంత మాత్రమున అశౌచమా ! ఇది శ్రుతి విహితమా ! మానవసేవను మించిన భగవత్ కైంకర్య మున్నదా ? ఆకలిబాధచే ఆర్తిచెందు ఆశ్రమవాసు లకు, పట్టెడన్నము పెట్టిన పాపమా ! ఎంతకోపమా బాలునకు ?

శివ : (ప్రవేశించి) పరదేశీ - పరదేశీ - యిప్పుడు పదిగంటలు దాటింది ఏమికర్మమోయి? దోసెడు బియ్యమైనా దొరకలేదు.

పర : సర్వేశ్వరునకు కరుణ సన్నగిల్లె నీనాడు.

శివ : సర్వేశ్వరుడు చట్టుబండలుకాను. కాళ్లు లాగుచున్నవి. కడుపు కాలిపోతున్నది.

పర : దాసూ ! నీకు చెప్పలేదా ప్రాయోపవేశం వద్దని. దానికి అచంచలమైన ఆత్మనిగ్రహ ముండవలెను. అరి షడ్వర్గముల బారిపడకుండవలెను.

శివ : నీప్రాయోపవేశం పటాపంచలుకాను- కడుపులో నొప్పి. కళ్లు తిరిగిపోతున్నాయి. ఆరు రోజులనుండి అన్నం నీళ్ళు లేక అలోలక్ష్మణా అని ఎల్లావున్నావో నీవు?

పర : దాసూ ! ధైర్యం చిక్కబట్టుమయ్యా - నేనేమి చేయను? మనకర్మం అలావున్నది. మిల్లులో మాన వద్దని చెప్పలేదా ! ఇంతకు దైవసంకల్పం యిలావుంది యివేళ.

శివ : దేవుడుమాట చెప్పకు - పొట్టకోసం - అబ్బా - ఆకలి- ఆకలి - పరదేశీ - (ఆయానమున నేలబడును.)

పర : అబ్బా ! దినమునకు రెండణాల కూలిచే కూటికి సంపా దించుకొను నీతని నేనే సంకట పెట్టితిని - మతాంతరు డైన మంచి యుద్యోగమున నుండగల నీతని నేనే నివారించితిని - మైత్రియే పావనమని తలంచినన్ను అను సరించు నీతనికింత గంజియైన యివ్వగల స్థితినాకు లేదే ! ఏమినిర్భాగ్య జీవితము !

కులమున కాకళంకమొన గూడెను; సద్గుణవల్లి తల్లి క న్నులకెడమయ్యె; స్నేహితుని నోటికి చేతికి దూరమయ్యె; నా వలన కులమ్ము పెన్పగకు పాల్పడె బ్రాహ్మణు; డింకొకండు భూ స్థలిగలడా అభాగ్యఫలజాతకుడింతకు దక్కియుండునే.

ఇటు లేకతంబున నేడ్చిన నెవ్వరాలకింతురు ? కానిమ్ము- దాసూ ! ధైర్యం వహింపుము. ఎవరికైనను దయ కలుగునేమో.

(ఒక బ్రాహ్మణుడు స్నానంచేసి వెళ్ళుచుండగా)

స్వామీ! నమస్కారము. ఈతడు నాస్నేహితుడు. రెండు దినములైనది తిండితిని.

బ్రాహ్మ: అయితే?

పర: ఆయింట ఒక్క కబళమైననూ దొరకలేదు.

బ్రాహ్మ: కారణం?

పర: మేము పంచములము.

బ్రాహ్మ: ఆరి దౌర్భాగ్యుడా? పంచములమని పెద్దపేరు పెట్టుకుంటావేమిరా పాకీవెధవా - స్నానంచేసి స్వచ్ఛంగా వేదంవల్లిస్తూ వస్తుంటే నడిబజారెక్క - పో - దూరంగా పో ముందు.

పర: దప్పికగొని నామిత్రుడు మిగుల డస్సియున్నాడు. ఒక గ్రుక్కెడు నీళ్ళుపోసినచో అతడు బ్రదుకును. తమరు దయయుంచి.

బ్రాహ్మ: దయయేమిటిరా? మాలవాడి మట్టిపెంకులో మంచి నీళ్ళు పొయ్యమని అడుగుతున్నావటరా బ్రాహ్మణ్ణి - నీపాపం బద్దలుకాను.

శివ: దాహం - అన్నంలేకపోతే యిన్నినీళ్ళైనాయిప్పింపవా?

పర : వింటిరా ఆతని ఆర్తనాదము - అనుగ్రహింపుడు. గుక్కెడునీళ్లు - కేవల మంతియే - ఆతడు మరణించిన ఆపాపము నామెడ జుట్టుకొనును.

బ్రాహ్మ : నోరుమూయ్యి యిక. యింటిదగ్గర యిల్లాలి తిథిఅని త్వరగా వస్తుంటే సగందారిలో దాపురించావు చండాలుడా.

పర : ప్రాణదానం బ్రాహ్మణధర్మం.

బ్రాహ్మ : ధర్మమేమిటి నీశ్రాద్ధం ?

పర : కోపంఎందుకు ? కొంచెం మంచినీళ్ళు.

బ్రాహ్మ : నీళ్ళా - (చెంబెడునీళ్లు మొగమునపోసి వెళ్ళును.)

పర : ఎంత దుర్గతి ? అన్నమడుగలేదు - వస్త్రమడుగలేదు. ధనము కావలెననలేదు - ధాన్యం కోరలేదు. పాంచభౌతికమైన - ప్రాణాధారమైన యింత జలమిమ్మనిన అందుకూడ మాలతనపు మైలసోకెనా ! ఏది తెరవు ? దాహముతేక యితనికి శోషవచ్చెనే - చెరువువద్దకు పోరాదు. జలాశయము లేదే - స్నానఘట్టము బ్రాహ్మణపాలితనము. ఇక మా దాసు మంచినీరుకై చావవలసినదేనా ? ఒక్కరికీ ధర్మం తోచదా ? ఒక్కరికీ మానవత్వము లేధా ?

భారతీయుల ధర్మ ప్రభావగరిమ
ఖండఖండాంతరముల ప్రఖ్యాతిగాంచె
సాటిమానవుడాకట చచ్చుచున్న
నీటికే గతిలేక చింతింపవలసె.

కాలమా ! నీవునన్ను కబళించుముగాని మా దాసును చేరరాకుము.

(ఒక వృద్ధుడు చేత పళ్ళెరముతో పంచదార, పిండికలిపి చీమల బొరియలలో పోస్తూ ప్రవేశిస్తాడు)

పర : ఈమహానుభావుని కెంతభూతదయ - మానవులన్న, నెటులనో శారీరికకష్టమున సంపాదింప గలరుగాని, పాపము జంతుజాలములవి. అయ్యా ! వందనము - వీడు మా దాసు.

వృద్ధు : దోవలో పడుకున్నాడేం ? తప్పతాగి పడినాడా ?

పర : లేదు - మేము మాంసభక్షకులము కాము - పంచములమైననూ మద్యము దాగివము. రెండు దినముల నుంచి యితనికి తిండిలేదు - ఎక్కడా దొరకలేదు.

వృద్ధు : దొరకకపోతే దొంగతనం సాగించండి.

పర : అయ్యా ! బీదలమైననూ దొంగలముకాము. పేదరి

కపు బాధయేగాని పెన్నిధిపై అపేక్షలు లేవు. రెండు గ్రుప్పెడుల పిండి పెట్టినచో ఆతని ఆకలి బాధతగ్గును.

వృద్ధు : దూరంగావుండు. నీకు పిండిపెట్టితే స్వాములవారు చంపించెయ్యరూ - మీకు తిండిగాదుగదా, కనబడితే కాల్చేయమన్నారు కూడాను.

పర : ఇవి మీ అందరి స్వబుద్ధిగాదా ? ఏమిస్వామీ ? మేము చీమలవలె ప్రాణులమేనే ! శ్రీకృష్ణ భక్తిగలిగిన వారమేనే !

వృద్ధు : భక్తియేమిటి నీపాడె మాలవెధవకి ? ఆలయంలోకి పోవాలని ప్రజల ప్రాణాలు తీస్తున్న నీకు పిండిపెట్టాలీ, తిండికి మలమలమాడుతూ ప్రాయోపవేశం ఏమిటి ఏమిటిరా పాకీవెధవ ?

పర : నా ప్రాయోపవేశం ఒకరికి ప్రాణసంకటంకాదు - అది నా పాపవిముక్తికొరకు.

శివ : అబ్బా - ఆకలి - ఆకలి.

పర : బాబూ పిండి ! శరణాగతత్రాణము బ్రాహ్మణ ధర్మము.

వృద్ధు : అదుగో దగ్గరికి వస్తున్నావటరా - తాకుదామనే ? తన్నులులేక - వళ్లు చిమచిమలాడి - అదుగో ! తాకి

నట్లేవుంది - చెంగుతగిలినట్లే వుంది. నీమొఖాన వేసి కొట్టుకో వెధవా ! (పిండి విసరి కొట్టి త్వరగా వెడలి పోవును.)

పర : ఎట్టి జీవకారుణ్యము! సమస్త చరాచరములను సమమైన భూతదయతో చూడవలెనని కదా సనాతనులవాదము. చీమలకుసైతము పెట్టబడుపిండి మానవులకు ! అర్హుల మే! మాకు పెట్టుటకు నెనుకాడెడి ధర్మమేమి ? భూతదయా పరిపూర్ణులగు భారతీయులిట్టి దయయా చూపవలసినది ? ఆపిండియైననూ పోగుచేసెదగాక.

(పోగుచేయు చుండును.)

(స్కూలు విద్యార్థి ఒకడు పుస్తకాలు పుచ్చుకొని సైకిలుపై వెళ్ళుతూ ఆగి ఒక కానీ ధర్మంవేసి వెళ్ళు తాడు.)

శివ: అయ్యయ్యో — ఆకలి — దాహము — నాలుక — ఎండిపోవుచున్నది — నిలువజాలను.

(కాలు జాపును. పోగుచేయబడిన పిండి చెల్లాచెదరై పోవును.)

పర : మా జీవితమువలె యిదియు అధఃపతితమైనది. అనుప యోగమైనది. ఇక మా దాసునకు మరణము సంభ వించునేమో ! ఈతని లేవదీయ తగుశక్తి నాకు లేదు.

ఎచ్చటకు తీసికొని పోలేనే! దారిలో ఈతడు చచ్చి
చో సవర్ణులు నన్ను చంపెదరు. తుదకు మరణించుటకు
సైతము మార్గమున ప్రాప్తములేదు.

(పళ్ళు అమ్మేవాడు వస్తాడు.)

అయ్యా — నీవే దేవుడవు — రా నాయనా — ఒక్క
కానీకి పండ్లు యిమ్ము — ఆలసింపకుము — అసువుల
బాయు నాతడు.

పండ్ల : సరేలే — కోవెలదగ్గర దెబ్బలు తిన్నవాడివి నీవే
కాదూ? దయచేయి బాబూ!

పర : ఏదో ఆ దినమట్టిది. ఇదిగో కానీ.

పండ్ల : మాలవాడికి పండ్లు అమ్మితే కోవెల దగ్గర యింకా
ఎవరైనా కొంటారా? అందులో నీకు అసలు అమ్మ
కూడదు.

(త్వరగా పోవును)

పర : (అతడుపోవు దిక్కుకై అతి దీనముగా జూచుచు
నిలువబడును.) ఇప్పటికి ఆశలన్నియు దీరిపోయినవి.
ఇక మాదాసునకు ప్రాణాపాయము తప్పదు కాబోలు.
మరణమా — మరణమా — అదియే శరణముగుగాక.

అన్యాలోచన లడంగుగాక. ఆత్మపారిశుధ్య మేర్పడు గాక. పరీక్షా సమయమా ! శ్రీకృష్ణా !! భక్తుడను గానా ? రక్షింపవా ? మార్గము జూపవా ? ఇది పాడియా ? నా పాపము పండెనా ? అవతరింపవా ? ఇది సమయము కాదా ? ఆలసింతువా ? వలయు నన్ను నిన్ను వలదన్నవారిని వేడెదను......గజేంద్రుని కష్టము గడచినది. అంబరీషుని ఆర్తి అంతరించినది. ద్రౌపది దుఃఖము దీరిపోయినది. కుచేలుని ప్రాణము కుదుటబడినది - రమ్ము - భూమి నవతరింపుము. ధర్మము స్థాపింపుము - కృష్ణా ! కృష్ణా !! కృష్ణా !!! రక్షింపుము - రక్షించుట - రక్షణము - రక్షణమా - లేదు. పక్షపాతము - అవును - పక్షపాతమే - దేవునికి కూడ కలిగినది. దేవుడు - దేవుడా లేడు - దైవమన్న వారు తాంత్రికులు - భక్తియన్నవారు పాషండులు - దుర్మార్గముగాక యిది తోయజాక్షుని భక్తిమార్గమా? భక్తుల బాధించియు, మోక్షమొసగలేని - చెనటుల శిక్షింపలేని - ధర్మము స్థాపింపలేని - శ్రీనివాసుడు దేవుడా ? కాదు..............................

ఆతని దాస్యమే నన్ను దరిద్రుని చేసినది. ఆతని సేవయే

నన్ను శిక్షితునిచేసినది. ఉపవాసములుంటిని కానిఆత డాలకించలేదు. మరణమునకై పాల్పడితిని కాని అతడు శరణమియ్యలేదు - ఆత్మార్పణమని ఆసపడితిని కాని ఆతడు కఠినాత్ముడు - ఆత్మార్పణము ! అవును - ఆస న్నమైనది - అరగడియలోనే - హైందవ హృదయ పరివర్తనమునకే - మృత్యుదేవతా ! నీకుగూడ అస్పృ శ్యతా దోషమువచ్చెనా - నీ దంష్ట్రాకరాళము తెరచి హుంకరింపవు?..............................

శరీరమున మంట లెగయుచున్నవి - భూమి గిరగిర తిరుగుచున్నది. కన్నులు పచ్చబడినవి- అదే తెరబడు చున్నది - ఇదే పతితపావనునిపై భక్తిపారంగతకు భరతవాక్యము - మంగళాశీర్వాదము భగవంతుడు తరువాత జేయుగాక. (ఆయాసంతో తూలిపడి పోతాడు.)

సుశీల : (తొందరగా వచ్చి) పరదేశీ - పరదేశీ - లే - రా - స్వామి.........

పర : స్వామి - స్వామి లేడు - దైవంలేదు - అంతామోసం - ప్రపంచం అంతా పాపభూయిష్ఠం - (తెప్పరిలి) అమ్మా ! సుశీలమ్మ తల్లి ! !

(ఆయాసంతో మంచినీళ్లు కావాలని సంజ్ఞ చేస్తాడు. సుశీల పరుగెత్తుకుంటూ వెళ్ళి చెంబుతో నీళ్ళు తెచ్చి పరదేశికీ, శివదాసుకూ పోస్తుంది. రామోజీ, రాజశేఖరం, శంకరరావు, రామనాథం మొదలగు వారు వస్తారు. పరదేశి, శివదాసు లేచి కూర్చుంటారు.)

**రామో :** పరదేశీ ! నీవు ముందు ప్రాయోపవేశమును విరమించవలెను. సత్యము వచింప, నిమ్నజాత్యుద్ధరణం వలననే జాతీయ సామరస్య మేర్పడుతుంది. వంచకత్వము, శఠత్వమే శరణ్యమని యెంచి ఐహిక సుఖలాల సత్వమున దేలియాడు మఠాధిపతుల ప్రల్లదముల వలననే పొడగుచున్నదీ ప్రచారము.

శంక : లే — అబ్బాయి లే

రామ : ఇది భారతీయుల సాంఘిక చరిత్రలో సువర్ణాక్షరముల వ్రాయబడు గాక !

పర : ఆర్యుల కందరకు అభివాదములు. (రామనాథంతో) అయ్యా ! మీరు నాకొరకై విశేష శ్రమబడినారు. ప్రపంచమున ఒకానొక ప్రచారకర్తవలనగదా ఒక్కొక్క ప్రతీతి వెల్లడి యగుట.

రామో : రామనాథంగారి కార్యదీక్షయే మీ విజయానికి కారణభూత మైనది. వారిటులనే సేవజేయుటకు ప్రోత్సాహ పూర్వకంగా వారికి పదివేల రూపాయలు విరాళమిస్తున్నాను.

పర : ఆ సుశీలమ్మతల్లి! స్వార్థత్యాగశీల — మాప్రాణములు రక్షించిన ధర్మాత్మురాలు — స్త్రీహృదయం మార్పు చెందనిదే ఏ సంస్కరణము జయప్రదము గాంచనేరదు కదా.

రామ : నేను చాల సుదినము. నాకు కన్నుల పండువయినది. అందరు ఐకమత్యమున నిటులనే యుండిన జాతీయ కల్యాణమునకు వేరేమి గానలెను? పతితపావనుడన్న భగవంతుడు. సత్యము, అహింస, ఆత్మవిశ్వాసము, మొదలగు ఆశయములతో కర్మయోగివై, నేడు పతితులైన పంచములను పావనమొనర్చు సద్గుణశాలివి- నీవే పతితపావనుడ విప్పుడు.

పర : అంతమాట వద్దు స్వానుభవమున ఒక్క విషయమే నాకు జీవ సూత్రమైనది.

దైవమే ధర్మము ; అతడెపో ధర్మమనగ,
రెంటికి నభేదవృత్తి గల్పించుకొన్న
వాడె తరియించు ; లోక సంపదకు వాడె
నాయకాగ్రణి ; ఇదియె నిర్ణయము, నిజము.

(అందరూ మంగళగీతాలు పాడుతారు.
దూరాన గుళ్లోగంటలు వినిపిస్తాయి.)

---

పుస్తకాలు కావాలంటే...

ఏలూరులో

గ్రంథకర్తకు గాని

కృష్ణానంద ప్రెస్‌కు గాని

వ్రాయాలి.